శ్రీమదాంధ్ర

# మహాభారతము

## ఉద్యోగ పర్వము

వెల ఒకరూపాయి

---

త్వరలో వచ్చుచున్నది.

# టామ్ సాయర్

(పిల్లల నవల)

రచన:

మార్క్ ట్వేన్

అనువాదం:

నండూరి రామమోహనరావు

వెల రు. 2/- పోస్టుఖర్చులు ప్రత్యేకం

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము.

---

కాపీలకు:

ఆంధ్రగ్రంథమాల,

నెం. 7 తంబుచెట్టివీధి, మద్రాసు 1.

# 6 వ, వారం!



"విశాలాంధ్రా వనిని
వినోద విలాసాలలో తేలించే
రమణీయ చిత్ర రాజము,,

వినోదా వారి...

# స్త్రీ సాహసము

రచన... పర్యవేక్షణ
..సముద్రాల..

...దర్శకత్వం...
వేదాంతం రాఘవయ్య

సంగీతం... సుబ్బరామన్. ఛాయ.... రంగా. కళ.... వాలి, గోడగాంకర్

# విషయానుక్రమణిక

## 12 సెప్టెంబరు 1951



# "కాంచన ద్వీపం"

## బొమ్మరిల్లు సీరియల్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికలో **19-9-'51** బుధవారంనుండి రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ వ్రాసిన "ట్రెజర్ ఐలెండు" నవల అనువాదం "కాంచన ద్వీపం" అను పేరుతో సీరియల్‌గా ప్రకటింపబడుతుంది.

—సంపాదకుడు.

(వివరాలకు 33-వ పేజీ చూడండి)

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **52**
**12-9-51**

ఖర సంవత్సర భాద్రపద ద్వాదశి బుధవారము


# ★ ఆంధ్రరాష్ట్రం-స్వామీజీ దీక్ష ★

[సూర్యనారాయణ]

ఆంధ్రరాష్ట్రాన్ని సాధించడంకోసం స్వామి సీతారామ్‌గారు ప్రాయోపవేశ దీక్ష ప్రారంభించి మూడు వారాలు దాటింది. వారితోపాటు దీక్ష నవలంబించిన వారిలో ఇద్దరు ముగ్గురికి స్పృహ తప్పిపోయింది. స్వామీజీ పట్టుదలను గ్రహించడానికి ఆంధ్రదేశ నాయకులకు రెండు వారాలు పట్టింది. గ్రహించిన తరువాత ఒక్కొక్కరే ఢిల్లీ వెళ్ళి సంప్రదించి రాగలరని చెపుతూ, తమ సంప్రతింపుల బలంమీద విశ్వాసం పెట్టుకుని దీక్ష విరమించవలసిందని స్వామీజీకి విజ్ఞప్తులు, సందేశాలు పంపడం మొదలుపెట్టారు.

మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి కుమారస్వామిరాజాగారు స్వామీజీ దీక్షనుగురించీ, ఈ దీక్షవల్ల ఆంధ్రదేశంలో రాగల పరిణామాలనుగురించీ భారతప్రధానికి ఎప్పటికప్పుడు నివేదిస్తున్నారు. అనంతశయనం అయ్యంగార్, తిరుమలరావు, కళా వెంకట్రావు మొదలైన పార్లమెంట్ ఆంధ్ర సభ్యులు కొందరు ప్రధాని నెహ్రూవద్దకు రాయబారం వెళ్లారు. పండిట్ నెహ్రూ ముఖ్యమంత్రి కుమారస్వామిరాజాగారికి వ్రాసిన లేఖలలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గురించీ, స్వామీజీ దీక్షనుగురించీ తమ అభిప్రాయాలను స్పష్టపరిచారు. తిరుమలరావు వెంకట్రావు మొదలైన రాయబారులకు కూడా అవే అభిప్రాయాలను తెలిపి ఉంటారనే భావించాలి. రాయబారం అనంతరం రాయబారులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి పండిట్ నెహ్రూ సుముఖులేననీ, కాబట్టి దీక్ష విరమించవలసిందనీ స్వామీజీకి తంతివార్త పంపారు. స్వామీజీ పండిట్ నెహ్రూ లేఖను పత్రికలలో చదువుకుని దానిపై తమ అభిప్రాయాన్ని కూడా ప్రకటించారు.



స్వామీ సీతారామ్

పండిట్ నెహ్రూ మద్రాసు ముఖ్యమంత్రికి వ్రాసిన లేఖలో, భారతప్రభుత్వం తరఫున తా మిచ్చిన హామీని గమనించి దీక్ష విరమించవలసిందిగా స్వామీజీకి విజ్ఞప్తి పంపారు. సమస్య మంచిచెడ్డలు ఎటువంటివైనప్పటికీ (అనగా న్యాయాన్యాయాల సంగతి ఎలా ఉన్నప్పటికీ) పరిపాలన విషయాలలో ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి సత్యాగ్రహం చేసే పద్ధతిని నెహ్రూ నిరసించారు.

రాష్ట్రవిభజన సమస్యను గురించి నెహ్రూ ఇలా వ్రాశారు: "ముఖ్య అంశాలపైనే అంగీకారం కుదరనప్పుడు, మద్రాసు నగర భవిష్యత్తు మొదలైన వివాదాల గురించి ముఖ్యనాయకుల మధ్యనే అంగీకారం కుదరనప్పుడు, ప్రభుత్వం చర్యతీసుకోడం అసాధ్యమనీ, కనీసం కష్టసాధ్యమనీ మీరు (అంటే ముఖ్యమంత్రిగారు) గ్రహించే ఉంటారు." భారతప్రభుత్వం ఆంధ్రరాష్ట్రంవిషయమై ఇదివరకే తమ అభిప్రాయాన్ని స్పష్టపరిచిందనీ, ఇంక పొరుగువారికి (అంటే తమిళులకు) కూడా ఇష్టమైన పద్ధతిని అసందిగ్ధమైన ఒప్పందం కుదుర్చుకునే కర్తవ్యం ఆంధ్రదేశ నాయకులపైనే ఉందనీ నెహ్రూ వ్రాశారు. ముఖ్య అంశాలను మధ్యవర్తుల పరిష్కారానికి విడిచిపెట్టవలసి

వస్తే, అటువంటి ఒప్పందం భారతప్రభుత్వానికి చాలదని స్పష్టపరిచారు. తాపైనా ప్రశాంతంగా, నిష్పక్షపాతంగా ఈ సమస్యను పరిశీలించాలంటే, బేషరతుగా స్వామిజీ దీక్షను విరమించాలని నెహ్రూ నొక్కి చెప్పారు.

ఈ లేఖను ముఖ్యమంత్రిగారు తమకు పంపలేదని స్వామి సీతారామ్‌గారు ప్రకటిస్తూ, లేఖ సారాంశం తమకు తృప్తికరంగా లేకపోగా, అవమానకరంగా ఉందన్నారు. రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ మినహా, మరే కేంద్ర నాయకుడూ స్వామిజీ విన్నపాలను చెవినైనా పెట్టలేదు. ప్రధాని నెహ్రూకు, రాజాజీకి విజ్ఞప్తులు పంపుకున్నా తంతివార్తలు పంపుకున్నా, చివరికి అవి తమకు అందినాయన్న కబురైనా లేకపోయిందని స్వామిజీ అన్నారు. ఆంధ్రరాష్ట్రం కావాలని ఒకరు సత్యాగ్రహం చేస్తే, రాష్ట్రవిభజనవద్దని మరొకరు సత్యాగ్రహం చెయ్యవచ్చునని నెహ్రూ వ్రాసిన వాక్యం ప్రతికక్షుల్ని రెచ్చగొట్టగలదని చెప్పుతూ, ఇది దుస్తంత్రమని స్వామిజీ నిరసించారు.

పండిట్ నెహ్రూ వ్రాసిన లేఖ ఆంధ్రదేశానికి ఆశాభంగం కలిగించింది. వెంటనే ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి నెహ్రూ సమ్మతించగలడని ఎవరూ ఆశపడలేదు. కాని ఆంధ్రరాష్ట్రోద్యమంపట్ల వారి వైఖరి మరింత స్పష్టపడింది. స్వామిజీ దీక్షవల్లగాని, నెహ్రూ ఉదారబుద్ధివల్లగాని ఆంధ్రరాష్ట్రం లభిస్తుందని ఆంధ్రదేశం ఆశపడలేదు. కాని ఆంధ్రరాష్ట్రోద్యమంపట్ల నెహ్రూ వైఖరి, మన సోదరులనుకొనే తమిళుల వైఖరి, ఆంధ్రదేశ నాయకుల వైఖరి ఈ ప్రాయోపవేశ దీక్షవల్ల మారగలవని ఆశపడినవారికి ఆశాభంగం కలిగింది.

సత్యాగ్రహ మనగా ఏమిటో, ప్రాయోపవేశ దీక్ష లక్ష్యమేదో స్వామిసీతారామ్‌గారికి తెలియదని నెహ్రూ కాని మరే నాయకుడు గాని అనలేరు. పరిస్థితులు అనుకూలించకపోయినా రాష్ట్రాన్ని విభజించాలని ఒత్తిడి తేవడానికి స్వామిజీ మొదలైనవారు ప్రాయోపవేశదీక్ష అవలంబించారని ఆరోపించడం అపచారం.

ఆంధ్రరాష్ట్రోద్యమం దేశంలో నవ్వులపాలయిందన్న సత్యాన్ని మనం గుర్తించక తప్పదు. ఆంధ్రదేశనాయకుల ఆరంభశూరత్వం రాష్ట్రోద్యమ ప్రతి ప్రతికూలురకు బలమయింది. అన్యరాష్ట్రాలలోని వారూ, మన రాష్ట్రంలోని అవకాశవాదులూ ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని నీచభావంతో పరిగణిస్తూవచ్చారు. రాష్ట్రోద్యమానికి అవసరమైన నైతికబలాన్ని ఆంధ్రదేశనాయకులు చేకూర్చలేకపోగా, ఆరంభశూరత్వం ప్రదర్శించి, ప్రచారమే ప్రధానమని భావించి రాష్ట్రోద్యమాన్ని నవ్వులపాలు చేశారు. రాష్ట్రవిభజనకు సంబంధించిన సమస్యల స్వరూపాన్ని ప్రజలకు గాని, కేంద్ర నాయకులకు గాని స్పష్టంగా తెలియపరచక, కొందరు గొంతెమ్మ కోరికలతోనూ, మరికొందరు అనవసర ప్రచారాలతోనూ వికృత పరివర్తన తెచ్చారు.

ఉదాహరణకి మద్రాసునగర వివాదాన్నీ, ఇరిగేషన్ ప్రాజెక్టులనూ గమనించవచ్చు.



పండిట్ నెహ్రూ

నగరం యావత్తు ఆంధ్రులకే చెందాలని ప్రచారంచేసి చంద్రగిరి రాజుల దానపట్టాలను తవ్వి తీసి సరిహద్దు సమస్యను ఆవేశాలకు లోను చేశారు. ఇరిగేషన్ ప్రాజెక్టులలో కృష్ణానదీ జలాలు ఆహారోత్పత్తికి సద్వినియోగం కావాలంటే మద్రాసు ప్రభుత్వం తలపెట్టిన కృష్ణా పెన్నా ప్రాజెక్టుమంచిదో, పులిచింతల ప్రాజెక్టు మంచిదో ప్రజలకు బోధపడ్డంలేదు. పులిచింతల ప్రాజెక్టును ఆకాశాని కెత్తుతున్న నాయకులు కేవలం ప్రచారం ప్రధానంగా, రాష్ట్రోద్యమానికి మద్దతుగా, ఈ ఉద్యమం ప్రారంభించారో, లేక దేశక్షేమానికోసమే ప్రారంభించారో నిజం ఎవరికీ బోధపడ్డంలేదు. మద్రాసుప్రభుత్వం పులిచింతల ప్రాజెక్టు నిర్మించడం నష్టమనీ, కృష్ణా-పెన్నా ప్రాజెక్టు ఒక్కటే మంచిదనీ సమాధానమిస్తే ప్రజలు నమ్మలేని స్థితిలో ఉన్నారు. మద్రాసు మంత్రివర్గంలో తమిళుల మాటకే చెల్లుబడిఉందనీ, వారు ఆంధ్రదేశానికి అన్యాయం చెయ్యడానికి వెనుదియ్యరనీ ఆంధ్రదేశానికి తెలుసును. వారి ప్రాపకంలేనిదే తెలుగు మంత్రులకు మనుగడలేదనీ, తమిళు లెంతటి అక్రమాలుచేసినా తెలుగుమంత్రులు నిరోధించరు సరిగదా అదంతా సక్రమమని వాదించి సమర్థించగలరనీ అనేకులు భావిస్తున్నారు. ఆంధ్రదేశానికి అన్యాయం జరుగుతున్నప్పుడు ఇంతవరకూ ఏ ఒక్క సందర్భంలోనూ తెలుగుమంత్రులు నిరోధిస్తున్నారని కాని, నిరోధించే మనస్తత్వం వీరిలో ఉందని కాని అనుకోవాలంటే మచ్చుకైనా ఈనాలుగేళ్ల పరిపాలనలో ఒక్క తార్కాణం కనపడదు. ఈ పరిస్థితిలో కృష్ణాజలాల వినియోగం గురించి మంత్రి భక్తవత్సలంగారి ప్రాజెక్టుపట్ల ఒక్క తెలుగుమంత్రి సక్రమమైన అభిప్రాయం ప్రకటించలేదు.

ఈరీతిగా ఆంధ్రదేశసమస్యలు సవ్యంగా ప్రజలకు అర్థం కాకపోవడంవల్ల, పరిపాలనపట్ల ఎవరికీ ఉత్సాహం కలగడంలేదు. మన నాయకుల ప్రచారంపట్ల విశ్వాసం నశించింది. ప్రభుత్వసమస్యలపట్లనూ రాష్ట్రోద్యమంపట్లనూ తమిళుల వైఖరి ఎంత అక్రమంగా ఉందో, ఆంధ్రదేశ నాయకుల వైఖరి అంత ప్రతిపక్ష బలదాయకంగా ఉంది. దీనివల్లనే ఆంధ్రరాష్ట్రోద్యమం అందరి దృష్టిలోనూ చెలగాటమయింది. నాయకుల ఉద్యమప్రచారంలో సారంలేదని, ఉద్యమానికి బలంలేదని గ్రహించిన తమిళులు రాష్ట్రవిభజనను సులువుగా నిరోధించగలిగారు. నిస్సంకోచంగా కేంద్ర నాయకులు ఉద్యమాన్ని నిర్లక్ష్యపరచగలిగారు. ఆంధ్రదేశంలోనే కొందరిచేత ఆంధ్రరాష్ట్రం హానికరమని పలికించగలిగారు కూడా. ఈ పరిస్థితులకు ఆరంభశూరులైన ఆంధ్రదేశ నాయకులే పూర్తిగా నింద భరించాలి.

నాయకుల వ్యవహార దక్షత లోపంవల్లనూ, ఉద్యమప్రచార లోపంవల్లనూ రాష్ట్రోద్యమం బలహీనపడినమాట నిజమే కాని, రాష్ట్రవిభజనావసరం నానాటికి స్పష్టపడుతూ వచ్చింది. ఆంధ్ర కాంగ్రెస్‌లోని కక్షలవల్ల రాష్ట్రోద్యమాన్ని ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు విస్మరించారు. భాషారాష్ట్ర విభజనోద్యమం సంకుచితమైనదని

(47-వ పేజీ చూడండి)

# అత్తవారిచ్చిన కట్నం

**శ్రీ ప్రతాపరావు**

డబ్బు తేలికగా, ఏం కష్టపడకుండా రావాలనుకోవడం మానవ సహజం. అందుకనే లాటరీలు, పజిల్స్ ఎక్కువవుతున్నాయి యీ లోకంలో. దాసు కొసంవత్సరమే పెళ్ళయింది. పచ్చలారని పసిబిడ్డనిచ్చి కూడా పది వేలివ్వాల్సొచ్చిందే అని గునుస్తూ యిచ్చాడు దాసు మామగారు ఆ డబ్బు.

దాసు కష్టపడకుండా డబ్బు సంపాయించాలనే తత్వంలోవాడు. పెళ్ళి అనే ఆయుధాన్నుపయోగించి కొంత డబ్బు చేసుకున్నాడు. నాలుగు డబ్బులు గలగలలాడుతూండేటప్పటికి మనస్సు పరి పరి విధాల పోయింది.

మా యింటికొచ్చాడు:

“ఒరేయ్, రామం! డబ్బు సంపాయించే విధమేదయినా చెప్పరా!”

“ఉద్యోగం చెయ్యరా!” అన్నాను అప్పుడే ఏదో పరమ సత్యం కనిపెట్టినట్టు.

“ఏడిశావులే! అది నాకు నువ్వు చెప్పాలట్రా! మరి అంత వాజమ్మననుకున్నావా ఏమిటి! ఒరేయ్, కాలు కదపకుండా, వొళ్ళు కదలకుండా, యినప్పెట్టి తియ్యకుండా, మాటపడకుండా నాలుగంకెలమీద ఉండాలి ఆదాయం. అలాంటిదేదయినా తెలిస్తే చెప్పు.” అన్నాడు

“దాసూ, స్నానం చేసొచ్చావా?”

“ఎందుకొచ్చిందా ధర్మ సందేహం?

“చేసొచ్చావా?”

“ఆఁ”

“అయితే విను. తూర్పుకుతిరిగి పద్మాసనం వెయ్యి ఆ దీన బాంధవుణ్ణి ప్రార్థించు. ఎప్పటికైనా కటాక్షిస్తాడేమో! ఏ నాటికయినా కరుణిస్తాడేమో!

“భక్తా, నీ భక్తికిం మెచ్చితిని. ఇదే గైకొనుము పది వేల రూప్యంబులు అని కూడా చెప్పేయి.” అన్నాడు దాసు.

“లేకపోతే ఏమిటిరా గొంతెమ్మకోరికలు!” అన్నాను.

‘నేను చాలా సీరియస్‌గా చెప్తున్నానురా రామం! ఏదయినా ఒకుపాయం ఆలోచించాలి.’ అని మళ్ళీ మొదలెట్టాడు.

“ఇదుగో, అత్తారిచ్చిన పదివేలున్నాయి. ఒక అయిదు వేలు పెట్టి వ్యాపారం చెయ్యి.”

“ఏం వ్యాపారం చెయ్యాలి?” అని అడిగాడు.

“...నిత్యమూ అవసరంగా ఉండేవి ఘూసి ఫా [illegible] న్సీషాపు పెట్టు” అన్నాను.

“అలాగే పెట్టాననుకో. అవి అమ్మకపోతే క్రిష్టలో పాకేయాలి. పోనీ అమ్మినయ్యే అనుకో, ధరలు తగ్గితే, చీటికి మాటికి ధరలు హెచ్చి, తగ్గే రోజులలో రిస్కు (*risk*) ఎలా తీసుకుంటాము? పైగా వడ్డీ రాదయ్యె, డబ్బు లాకవు అయిపోతుంది. కనుక ఈ వ్యాపారం ఏమీ లాభం లేదు.” అని పెదవి విరిచాడు.

‘దాసూ, యిక నేను ఏదీ చెప్పలేను. బహుశ నీవు చేయతగ్గ వ్యాపారం ఈభూమిమీద లేదనుకుంటాను. ఆ ఆర్తరక్షకుడే నీకు శరణ్యము వాడికే ఒక ఉత్తరం వ్రాయి అని ఊరుకున్నాను.

సిగరెట్టుమీద సిగరెట్టంటించి, డి. వి. సుబ్బారావు పోజు పెటి ఐదు నిముషాలదేపనిగా ఆలోచించాడు దాసు మెరుపులా తట్టిందొక ఆలోచన.

“ఒరేయి రామం! ఆలోచించానురా. ఉపాయం, విను.” అన్నాడు.

“ఏమిటిరా, అది?” అని అడిగాను.

“వివాహ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, పెడదాము. డబ్బక్కర్లేదు. మనకున్న కోరికలన్నీ తీరతాయి.”

“పెట్టి ఏం జేస్తావు?”

“పెళ్ళిళ్ళు చేస్తాను, సంబంధాలు కుదురుస్తాను. వాళ్ళూ, వీళ్ళూ కూడా డబ్బిస్తారు.”

“అయితే పెళ్ళిళ్ళ పేరయ్య వవుతావన్న మాట.”

“మంచి ఉపాయం కదురా!”

“నీ బొంద! పెళ్ళంటే మాటల్లో ఉందిరా. వాళ్ళనూ, వీళ్ళనూ దగ్గరకు జేర్చాలి. ఎవళ్ళకు చెప్పే ఖబుర్లు వాళ్ళకు చెప్పాలి. ఇటు లోపాలుంటే అవి కనపడకుండా అటు చెప్పాలి. అటుంటే యిటు చెప్పాలి. పెళ్ళయిన తరువాత వాళ్ళువీళ్ళు తెలుసుకుంటే నిన్ను ఒక దీవించడం దీవిస్తారు నువ్వు మళ్ళీ ఈ జన్మలో మరచిపోలేవు ఎవడయినా పొగరుమోతుంటే దేహశుద్ధికూడా చేసేస్తాడు. పెళ్ళిళ్ళ పేరయ్యంటే తలలు మార్చేవాడని అర్థం! తెలిసిందా?” అన్నాను.

“మరేం చేద్దాము?” అని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

“నీదానిమీద కొంచెం ఇంప్రూవుమెంటేమిటంటే, మనం ఒక కేసు ప్రయత్నం చేద్దాము. వస్తే డబ్బొస్తుంది. లేదా ఎక్స్‌పెరిమెంటనుకుందా”మన్నాను.

“నువ్వు చెప్పేది నాకర్థంగాలేదు.” అన్నాడు దాసు.

“ఒక డబ్బున్నమ్మాయికి వరుడు కావాలి అని ప్రకటిద్దాము దాంతో మనకు ఒక పెళ్ళికొడుకులజాబితా ఏర్పడుతుంది.

“అంత వెర్రి వెధవలున్నారంటావా దేశంలో!”

“తొందరెందుకు? ఉంటే ఉత్తరాలొస్తయి లేరూ, *advertisement cost*దండగ. అంతేనా, కొంప మునిగిపోయిందేముంది?

“అది సరేరా? అసలు అమ్మాయేదీ? ఏరసికుడయినా చూస్తానని వస్తే వ్యవహారం తలక్రిందులైపోతుంది. మన సంగతి పసికట్టారా, వొళ్ళు బొబ్బట్టుడికినట్టు ఉడికించేస్తారు తెలిసిందా?”

“నువ్వు చెప్పిందీ నిజమేరా?” అన్నాను.

ఈ సారి యిద్దరమూ ఆలోచనలో పడ్డాము.

“అదు గడుక్కు ప్రోబ్లమేరా! హైడ్రోజెన్ బాంబు కనిపెట్టినవాడికి కూడా యిన్ని *problems* ఉండి ఉండవు.” అన్నాడు దాసు.

“తట్టిందిరా! మన సినోరా సీతాయిగాడితో మాట్లాడి నే ఏర్పాటు చేస్తాను. నువ్వెళ్ళిరా” అన్నాను.

సాయంత్రం వస్తానని చెప్పి దాసు వెళ్ళిపోయాడు.

సినోరా సీతాయిగాణ్ణి పట్టుకునేటప్పటికి బ్రహ్మప్రళయమయింది. వాడికంతా విపులీకరించి చెప్పాను.

‘మీకెందుకు, మీకు ఆడదుంటే సరా!

నేనన్నీ ఏర్పాటు చేస్తానుగా వెళ్ళండన్నాడు సీతాయి.

ఎవరో ఒక వేశ్యను చూపించాడు. నాకు చూడడానికి వేశ్యలా లేదు. పని గడచి పోతుందనుకున్నాను.

వచ్చే పెళ్ళికొడుకులలో ఆమె కెంత డబ్బున్నదని ప్రశ్నిస్తారేమో! ఆ బజారులో ఉంటే విషయం బయట పడుతుంది గదా! అని అనుమానం పీక్కు తింటోంది.

సినోరా సీతాయితో చెప్పి ఆ అమ్మాయిని వేరే పేటలో పెట్టాము.

దాసు ఆమె పేరట డబ్బు బ్యాంకులో మొదట వేయనన్నాడు. ఫరవాలేదురా, సినోరా సీతాయి మన నన్యాయం చెయ్యడురా అని నచ్చచెప్పాను. మొదట చాలా బింకంగా ఉన్నా, తరువాత వేశాడు.

మర్నాడు దిన పత్రికలో

"ఒక ధనవంతురాలయిన యువతికి అందమైన వరుడు కావాలి. వరుడు నడివయస్కుడై, ఆస్తిగలవాడయి ఉండాలి. కుల మత భేదాలు లేవు. ప్రకటన ఆదర్శమైన వరుని కోసం చేయబడింది."

వివరాలకు వివాహ ఇన్ఫర్మేషన్ బ్యూరోకు వ్రాయండి." అని మా ప్రకటన పడింది.

ఆ మర్నాడు రెండొందలు ఉత్తరాలొచ్చాయి మాకు. ఆ తరువాత రోజు అయిదొందలు యిలాగ వారం రోజుల్లో మూడువేలు త్తరాలొచ్చాయి పారిందిరా పన్నాగం అనుకొన్నాము నేనూ దాసూ.

ఉత్తరాలకు జవాబులు వ్రాయడం మొదలెట్టాము. ఫోటోలు పంపిన వాళ్ళకు వంశ వివరాలు, వాళ్ళకున్న ఆస్తి వివరాలు వగైరాలు వ్రాయమనీ, ఫోటోలు పంపని వాళ్ళకు ఫోటోలు పంపమనీ, ఎవరికితగ్గట్టు వాళ్ళకు వ్రాశాము. జవాబుతో పాటు రెండు రూపాయలు కూడా పంపమని కోరాము

రెరెడు రూపాయలు పంపమనేటప్పటికి ఒక అయిగు వందలు పెళ్ళికొడుకులు తగ్గిపోయారు. మిగతా వాళ్ళు డబ్బు పంపించి ఇంటర్వ్యూల కేర్పాటు చేయమన్నారు.

ఒక రెండొందలమంది కేర్పాటు చేశాము. కొంతమందికి తను వధువుకు నచ్చనట్టు వ్రాశాము. మిగతావాళ్ళకు వధువు వరుణ్ణి ఏరుకొందని వ్రాశాము.

ఈ లోపుగా ఆ అమ్మాయికి సినోరా సీతాయితో చెప్పించాము. ఎవరొచ్చినా యిష్టం లేదని చెప్పమని. ఆ అమ్మాయిసరేనని ఒప్పుకుంది.

వధువుకు వరుడు నిశ్చయమయ్యాడని చెప్పి, కొంతమంది వరుల్ని సాగనంపమని సీతాయితో చెప్పాము.

అనుకున్నవన్నీ ఏ అడ్డంకీ లేకుండా సలక్షణంగా జరిగిపోయాయి ఆ అమ్మాయికి ధన్యవాదాలు చెబుదామని నేను సీతాయి వెళ్ళాము. చిక్కు మొహం పెట్టింది. ఏమిటదని సీతాయి గర్జించాడు ఉన్న చనువు కొద్దీ.

"ఒకాయన వచ్చారు. అందరి లాగానే. ఎన్నో వృద్ధ జంబుకాలొచ్చాయి. సూట్లొచ్చాయి, కోరమీసాలొచ్చాయి. ఎంతమందో వచ్చారు. ఎవరిమీదా నా మనసు లగ్నం కాలేదు. ఎందుకనో ఆయన్ని పెళ్ళిచేసుకొందామని బుద్ధి పుట్టింది. అడిగాను. సరేనని ఒప్పుకున్నారు. కాని ఒక షరతు పెట్టారు. (*Bank pass book*) బ్యాంకులో ఉన్న డబ్బు ఆయన కివ్వాలట సరేనన్నాను. రేపొస్తా నన్నారు నన్నాయన కిచ్చి వివాహం చేయరా?" అని జంకుతూ అడిగింది.

నాకు చెమటలు పట్టాయి. సీతాయి కూడదని మందలించాడు ఆ వచ్చినతని కిచ్చి వివాహం చేయకపోతే ఆత్మహత్య చేసుకుంటా నంది.

ఇదేదో ప్రళయంగా ఉందే ననిసీతాయి, నేను బుర్రలు చెడగొట్టుకున్నాము. ఆ అమ్మాయి ఎంత చెప్పినా వినలేదు. తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళంది.

దాసుముందు పెట్టాను వ్యవహారమంతాను.

'నేను ముందు చెపితే విన్నావట్రా!

నాకప్పుడే అనుమాన మేసింది యిలాంటిదేదో జరుగుతుందని' అన్నాడు.

'ఇప్పుడు నీ కొచ్చిన నష్టమేమిటిరా! అప్పనంగా అయిదు వేలొచ్చాయి. మూడు వేలు ఆ అమ్మాయి తీసుకుంటే నష్టమేమిటి! అక్కడికి రెండు వేలు లాభమే నాయె. ఒక పతనమయిన స్త్రీని ఉద్ధరించిన వాడవూ అవుతావు. లాభం పొందిన వాడవూ అవుతావని లెక్కరిచ్చేశాను.

'నువ్వు చెప్పిచూశావా యిది అసంభవమని?' అని నన్ను ప్రశ్నించాడు.

'నా శాయశక్తులా ప్రయత్నించాను' కాని లాభం లేకపోయింది' అని నిస్పృహతో అన్నాను.

'సరే, నువ్వు చెప్పిన ఉపాయంతో ఆర్జించాను కాబట్టి, తీసుకోమను మూడు వేలు. యిదుగో చెక్కు.' అని సంతకం పెట్టిచ్చాడు.

దాసు త్యాగబుద్ధికి సంతోషించినా లోపల సందేహం కలిగింది. చెక్కు మార్చి మూడు వేలు తీసికెళ్లి ఆమె కిచ్చాను.

మర్నాడు సాయంత్రం దాసు కనుపించాడు.

(43-వ పేజీ చూడండి)




చీఫ్ ఎగ్జిక్యూటివ్: జె. ఎమ్. శర్మ

సీడెడ్ అండ్ చిత్తూరు: మహాత్మా పిక్చర్సు - కర్నూలు. * ఆంధ్రా: గోకులకృష్ణ పిక్చర్సు - విజయవాడ.
మైసూరు: నారాయణన్ & కంపెనీ - మద్రాసు. * నైజాం & బొంబాయి: దమెరియాటాకీ డిస్ట్రిబ్యూటర్సు.
సిటీ: అవర్ ఇండియా ఫిలిమ్స్, 19-ఇ, ఏకాంబరేశ్వర అగ్రహారం, మద్రాసు.
ఇతర ప్రాంతాలకు:
ప్రకాష్ శంకర్ పిక్చర్సు, 8-ఏ, లక్ష్మణచెట్టియార్ వీధి, మద్రాసు-17.

# గ్రామఫోను రికార్డు

## శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

ఆయనతో నాకు పరిచయం చాల విచిత్రంగా జరిగిందని చెప్పక తప్పదు. ఒకరిద్దరు స్నేహితులు ఆయన్ను చూపించి "ఆయన గొప్ప రచయిత" అని చెప్పేవాళ్లు. రచయిత అని ఎప్పుడయితే తెలిసిందో ఆయనతో స్నేహంకోసం వుబలాటపడ్డాను అనుకున్న త్వరలోనే ఆయనతో పరిచయ భాగ్యం లభించింది.

అసలు జరిగిన సంగతేమిటంటే ఒక రోజున నేను యిండియన్ కెఫేకి వెళ్లి ఉదరాన్ని భారంచేసి బిల్లుతీసుకుని బయటకి వచ్చి డబ్బుకోసం జేబులో చెయ్యి పోనిచ్చేటప్పటికి ఒక పెద్ద చిరుగు తగిలింది. దాంతో గుండె కొట్టుకోవటం మానేసింది. టేబిలుమీద బిల్లుపెట్టి ఎంతసేపటికీ డబ్బు రానియ్యక పోయేటప్పటికి అప్పటికప్పుడే అయ్యరువురిమి చూస్తున్నాడు. ఇక అయ్యరు గారికి క్షమాపణలు చెప్పుకుందామని చేతులు జోడించబోతుండగా కుడి భుజంమీద భారమయిన చెయ్యి పడింది. ఎవరా అని వెనుదిరిగి చూస్తునకదా ఆయనే. చిరునవ్వుతో "నేనిస్తానులెండి" అని జేబులోంచి రూపాయినోటు తీసి అయ్యరుకిచ్చి తిరిగివచ్చిన చేడకాసును పాంటుజేబులోకి జొనిపి బయటకు నడిచాడు. సిగ్గుపడుతూ నేనాయన్ని అనుసరించాను.

ఇద్దరం కొంతదూరం నడిచాం. చివరికి ఆయనే అన్నాడు "మిరేం పర్వాలేదు లెండి. మానవులమయి పుట్టినతర్వాత ఒకరికొకరు తోడ్పడుతూ వుండాలిగదా."

నేను ఖడియంగా నవ్వాను. "మీరు యివ్వాళ చేసిన సహాయం మరిచిపోలేను" అన్నా.

"దానికేముంది లెండి. నాకు అవసరం వస్తే రేపు మీరు సహాయంచేయరూ!" చచ్చాను. "అవునవును" అన్నా విధిలేక.

ఆ కనబడే డాబానే మాది. మా ఇంటికి రండి అని ఒక చిన్న డాబాను చూపించాడు.

ఇద్దరం వాళ్ల యింటిని చేరుకున్నాము. ముందు గదిలోకి వెళ్లి కూర్చున్నాం. అక్కడ రెండు సోఫాలు, ఒక మూల గ్రామఫోను అంతే. అంతకంటే మరే సామగ్రి లేదు. వెళ్ళి వెళ్లంగానే గ్రామఫోను తీసి బారిస్టరు పార్వతీశంలోని "పోయిరా ప్రియుడా లండన్" అన్నపాట పెట్టాడు. చెవుల్లో పట్టిన తుప్పంతా వదిలిపోయింది. పదేళ్ల నాటి సంగతులన్నీ జ్ఞాపకం రాసాగినయి.

"నాకు గ్రామఫోనంటే మహాయిష్టం."

ఏమనాలో తెలీక తలూపాను.

"అందులోనూ పురాతనపు పాటలంటే చెవి కోసుకుంటాను."

"దానికేముంది లెండి. పుర్రెకో బుద్ధి, జిహ్వకో రుచి అన్నారు పెద్దలు" అన్నాను.

"అలా అనకండి. పెద్దల కేం తెలుసు? పురాతనపు సాంగ్సులో ఎంత అందం, ఎంతసౌఖ్యం! నేను రోజుకు అయిదారు గంటలు గ్రామఫోనుతోనే గడిపివేస్తాను. నా దగ్గరున్న రికార్డులన్నీ చూపమంటారా?"

చచ్చేంతపని జరిగింది. "ఇప్పుడు ఎందుకులెండి! శ్రమ" అన్నాను సంబాళించుకుని.

లేవబోతున్నవాడల్లా కూర్చుని అన్నాడు "శ్రమేముంది లెండి. శ్రమ అనుకుంటే మనం ఏపని చెయ్యలేము...అయినా సరే లెండి వద్దన్నారుగా."

హృదయం శాంతించింది. ఒకసారి గది నాలుగు వయిపులా కలయజూశాను. అప్రయత్నంగా నా చూపు ఆయన కూర్చున్న సోఫాక్రింద సగం తొంగి చూస్తున్న బ్రౌను పేపరుమీద పడింది చటుక్కున తీశాను. ఏదో గేయం. మొదటి రెండుపక్తులూ కొంచం అర్థమవుతున్నాయి. మిగిలినవన్నీ కొంకిరిచింకిరిగా వున్నాయి.

"మీరు కథలు రాస్తారుటగా?" అడిగా. [illegible] అన్నాడు. "ఏదో లెండి. కథలకన్నా గేయాలు ఎక్కువగా రాస్తాను"

"బాగుంది" అన్నా.

ఆయన అప్పుడే ముగిసిన రికార్డు తీసేసి "ప్రేమయే జగతి" దంచుతున్నాడు.

"అతి మధుర మధుర ప్రేమ."

"మధురంగా వుందికదండీ"

"అవునవును"

"ఇక వస్తా" లేచా.

"అప్పుడేనా! రెండు రికార్డులు విని వెళ్లండి"

"ఇంకెప్పుడయినా వింటానులెండి. కాస్త అర్జంటుపని వున్నది."

"సరే మీ యిష్టం. ఎప్పుడయినా వస్తూ వుంటారుకదూ"

'అలాగే' అని బయటకు వచ్చేశాను. అంతకుముందు అతనిమీదనున్న అభిప్రాయాలు తొలగిపోయి నూతనాభిప్రాయాలకు చోటిచ్చాయి. నాకు అసలు ఎక్కువగా స్నేహితులు ఒకరిద్దరు వున్నా సాయంత్రంపూట అరుదుగా కలవరు. అందువల్ల కాలక్షేపం కోసమయినా అతనితో స్నేహం చేయాలనుకున్నాను.

రెండు నెలలు గడిచాయి. మా యిద్దరి మధ్య దోస్తీ బాగా కుదిరిపోయి ప్రతిరోజూ సాయంత్రం అతన్ని కలుసుకుంటూ వుండేవాడిని, అతనితో కాలక్షేపం చాల విచిత్రంగా వుండేది. గంటలు నిమిషాల్లాగ గడిచేవి.

అతని పేరు. వి. ఎస్. జైన్. మొదటి సారిగా ఆ పేరు విన్నప్పుడు తెల్లబోయాను. కాని అతనే చెప్పాడు తల్లి

(12-వ పేజీ చూడండి)

# జనాభా లెక్కలు

## శ్రీ సింగరాజు లింగమూర్తి

### 1

[తలుపు దడదడ తట్టినట్లు ధ్వని]

ఎన్యూమరేటరు : ఎవరండోయ్ ఇంట్లో.. (తిరిగి తలుపుతట్టిన ధ్వని) అబ్బ! ఎవరూ పలుకరేం?...పిలిచి పిలిచి గొంతు పోతున్నది. తలుపు తట్టి తట్టి చేతులు పడి పోతున్నాయి కానీ ఎవరూ తలుపు తియ్యరేం? (తిరిగి తలుపుతట్టిన ధ్వని) ఉన్న కర్మఉండగా ఉపాకర్మ అన్నట్టు, చేసే ఉద్యోగంతోనే సతమతం అవుతుంటే, పైన ఈ జీతం బత్తెంలేని ఉద్యోగమొకటి... ఈ జనాభా లెక్కలు పూర్తి అయ్యేలోపల ప్రాణం కడబట్టేట్టుంది... ఈసారైనా పలుకుతారేమో చూద్దాం... (పెద్దగా) ఎవరండోయ్ ఇంట్లో! (తిరిగి తలుపు దడదడ తట్టినధ్వని)

[తలుపు తెరచినధ్వని]

ఒక ముసలమ్మ : ఎవరు నాయనా నీవు?

ఎన్యూమ : మొదట, ఈ ఇంట్లో ఎంత మంది ఉన్నారో చెప్పండి!

ముస : ఏమంటున్నావు బాబూ?... కొంచెం పెద్దగా చెప్పు......ముసలి ముండను... చెవులు సరిగ్గా వినబడవు.

ఎన్యూ : (కొంచెం పెద్దగా) ఈ ఇంట్లో ఎంతమంది ఉన్నారు?

ముస : అదా...మా అబ్బాయి బజారుకు వెళ్లాడు.

ఎన్యూ : ఇస్...అబ్బబ్బ!...నా ప్రాణానికి ఈ ముసలిది దాపురించిందే... (ఇంకొంచెం పెద్దగా) అది కాదమ్మ ఈ ఇంట్లో ఎంతమంది ఉంటారూ!

ముస : మా ఇంట్లో చాలామందే ఉన్నారు...ఇంకో రేషన్ కార్డుకోసం మా అబ్బాయి రాశాడు...తెచ్చావా బాబూ... మా బాబే....నీ తల్లికడుపు చల్లగా నూరేళ్లు వర్ధిల్లు.

ఎన్యూ : ఓరి భగవంతుడా! ఈవిడ నడిగి తెలుసుకోటానికి తాతలు దిగివచ్చేట్టున్నారే! (కొంచెం పెద్దగా) ఈ ఇంటాయన పేరేమిటి అవ్వగారూ?

ముస : ఏమిటీ?...ఇంటాయన పేరా?...అయ్యో నా మొహంమండా! ఆ ధర్మాత్ముడి పేరు ఎట్లా చెప్పను బాబూ? వెనక ఒకసారి ఇట్లాగే ఆయనపేరు పొరపాటున చెప్పినందుకు ఆయనకీ భూమిమీద ప్రాప్తం లేకపోయింది. మీకు అంతగా కావాలంటే మా మునిమనమ డున్నాడే వాడి పేరు రాసుకోండి.. అది ఆయన పేరే!

[ఆ ఇంటిప్రక్కన ఉండే మరొక స్త్రీ కిలకిల నవ్విన ధ్వని]

ఎన్యూ : చచ్చానురా బాబూ!...ఈ ముసలమ్మతో ప్రాణం విసిగిపోవాల్సిందే; (కాస్తాగి) ఇదుగో ఏమండోయ్!...కాస్త మీరైనా చెప్పండీ.. ఈ ఇంట్లో ఉన్నాయన పేరు?

స్త్రీ : మీరు రేషనింగువాళ్ళా? మీరు ఎలాగూ రానేవచ్చారు కానీ, కాస్త మా ఎనిమిదో అబ్బాయిపేరు వ్రాసుకోండి. వాడికి కార్డుకోసం వ్రాయండని ఎన్ని సార్లు చెప్పినా మా మొగవాళ్లకి తీరిక లేకుండా ఉంది.

ఎన్యూమ : అయ్యో రామచంద్రా!... నేను రేషనింగువాడిని కాదండీ! నేను సెన్సస్ వాడిని. ఆ రేషనింగువాళ్లు వచ్చినప్పుడు కార్డు వ్రాయించుకుందురు గాని, మొదట నాకు వీళ్ల ఇంటి వివరాలు, మీ ఇంటివివరాలూ చెప్పండి.

స్త్రీ : ఏమిటీ... సెన్సస్సా!... ఇదో కొత్తపేరు వింటున్నానే... ఇంతమటుకు సెక్రెస్ పేరే విన్నాను, ఈ పేరు ఎప్పుడూ వినలేదే!

ఎన్యూమ : మీరు వినకపోవచ్చులెండి.., మేము జనాభా లెక్కలు తీసుకునేవాళ్లం.

స్త్రీ : (నవ్వి) ఓస్... అదా?...అయితే వ్రాసుకోండి.. ...మా ఇంట్లో ఎంతమంది ఉన్నారంటే, రాముడు, భీముడు, శంకరం, సీత...

ఎన్యూ : (విసుగ్గా) పేర్లన్నీ చెప్పక్కర లేదండీ! మొత్తం ఎంతమందో చెప్పండి.

స్త్రీ : అదేగా చెప్తున్నా......మొత్తం 8 మంది పిల్లలు, ఆ ఎనిమిదోవాడికే రేషన్ కార్డు కావాలన్నది. వాడిపాలు చక్కెరన్నా వస్తుందని ఆశ.

ఎన్యూ : అదుగో...మళ్ళీ మీరు రేషన్ గొడవలోకి పోతున్నారు...ఆడపిల్లలు ఎంతమందో, మొగపిల్లలు ఎంతమందో చెప్పండి.

స్త్రీ : ముగ్గురు ఆడపిల్లలు, అయిదుగురు మొగపిల్లలు.

ఎన్యూ : ఇంకెవరెవరున్నారో చెప్పండి.

స్త్రీ : నేనూ, మా మరిది, ఆయన అన్నగారు.

ఎన్యూ : మీ వారికి ఏమైనా భూములున్నాయా?...ఉద్యోగమా?

స్త్రీ : సరే...ఇవన్నీ చెప్పాలీ?... అయితే కాస్త ఆగండి...పొయిమీది పప్పు మాడిపోతుందేమో...ఇప్పుడే వస్తా. (వెళ్లినట్లు ధ్వని)

ఎన్యూ : బాగానే ఉంది ఈ ఉద్యో

గం...ఒక్కొక్క ఇంటిదగ్గర ఇంత ఆలస్యంఅయితే ఇహ పని జరిగినట్టే మళ్లీ వచ్చి వెడి ఆఫీసుకుపోవాలి......ఆఫీసు ఫైళ్లతోనే తల బ్రద్దకొట్టుకోనా, లేక ఈ జనాభా లెక్కలతోనే చావనా ?

ముస : ఇదుగో......చూడు నాయనా, మా అబ్బాయి ప్రొద్దున్నే ఉద్యోగంలోకి వెళ్లాడు కానీ, కాస్త ఒక అణా ఆకుకూర తెచ్చి పెడుదూ, నీ కెంతైనా పుణ్యం ఉంటుంది.

ఎన్యూ : హతోస్మి...హే భగవాన్... ఇంకా ఇక్కడే ఉంటే, ఈ ముసలమ్మ కాళ్లుకూడా పిసకమంటుందేమో ?

[పక్కింటామె తిరిగి వచ్చిన ధ్వని]

స్త్రీ : మీ తో మాట్లాడుతూ కూర్చుంటే, పప్పు కాస్తా మాడి బొగ్గయింది. పిల్లి కాస్తా పాలు పొట్టను బెట్టుకుంది. ఇంక పో నాయనా, పో తీరుబడిగా నీతో చెబుతూ కూర్చుంటే వంట అయినట్టే.

ఎన్యూ : నెల్లక ఉంటా నటమ్మా... కాస్త మీ ఇంటాయన పేరూ, సంపాదనా చెప్పండి.

స్త్రీ . బాగానే ఉంది. మేం కిరస్తానీ వాళ్ల మనుకున్నావా, మొగవారి పేర్లు చెప్పటానికి......మొగవాళ్లు ఉన్నప్పుడు రండి.

ఎన్యూ : మీ కెంతైనా పుణ్యం ఉంటుంది తల్లీ !.. కాస్త చెబుదురూ.. మళ్లీ రావాలంటే మా కెన్ని పను లుంటాయి. లేకపోతే కాస్త మీ మొగపిల్లలు ఉంటే పిలవండి...వాళ్లని అడిగి తెలుసుకుంటా.

స్త్రీ : అంతా బడికిపోయారు.. అంతగా రాసుకోతలిస్తే సాయంత్రం రండి, మొగవాళ్లు ఇంట్లో ఉంటారు.

[తలుపులు ఫెడేలున వేసిన ధ్వని.]

ముస : ఏం నాయనా పోతున్నారా ? ఈ ముసలిదానికి కాస్త పనిచేసి పెడితే అరిగిపోతావా బాబూ ?

ఎన్యూ : పాపం !.. .. ఉత్త అమాయికంది...(వెళ్లినట్లు ధ్వని) (మ్యూజిక్)

## 2

వేరొక స్త్రీ : దయచేయండి...ఆ కుర్చీలో కూర్చోండి.

ఎన్యూ : మీ పేరేమిటి ?

స్త్రీ : ఆనంద.

ఎన్యూ : మీ భర్తగారి పేరు ?

స్త్రీ : (నవ్వి) భర్తపేరా ?

ఎన్యూ : క్షమించాలి. ఇంకా మేరేజి కాలేదేమో..... పోనీ మీ తండ్రిపేరు చెప్పండి.

స్త్రీ : తర్వాత చెప్తానులెండి......టీ తెస్తా కూర్చోండి.

ఎన్యూ : అబ్బెబ్బె !...టీ వద్దు ఏమీ వద్దు...ఇక్కడనే కూర్చుంటే ఎట్లా ?... ఇంకా చాలా పనుంది.

స్త్రీ : ఫరవాలేదు ... ఎంతసేపు ? ... ఇప్పుడు తేనూ ? మా దాసీది బజారుకు వెళ్లింది, లేకపోతే అదే తెచ్చేది. (వెళ్లిన ధ్వని).

ఎన్యూ : ఇదేదో తమాషాగా ఉందే!... కొంపతీసి ... ఈ ఇల్లు. అలాగే ఉందే చూస్తే...ఛీ...ఛీ.. వెధవ అనుమానం... మామూలుగా అందరి ఇండ్లల్లోమాత్రం గోడలకు సినిమా బొమ్మలు లేవూ ?...ఎవరింటికి పోయినా, విసుక్కొని కసురుకునేవారే గానీ, ఇట్లా కూర్చోపెట్టి కమ్మగా మాట్లాడి టీ ఇచ్చేవాళ్లే లేరు... ఇష్ .. అప్పుడే చీకటిపడింది, ఇంకో అయిదారు ఇళ్లయినా తిరిగితేకానీ కొంతపని తెమలదు.

[స్త్రీ వచ్చిన ధ్వని[

స్త్రీ : ఇదుగో...టీ తీసుకోండి.

ఎన్యూ : థాంక్స్.. ఇహ చెప్పండి .. మీ నాన్నగారి పేరు ?

స్త్రీ : ఆయన చనిపోయారు. ఆయన పేరు రంగనాథం.

ఎన్యూ : అయితే మీ అన్నగార్లుగానీ, ఇం కెవరైనా వుంటే మీ ముఖ్యబంధువులు గానీ ఉన్నారా ?

స్త్రీ : ఎందుకండీ మీ కీ అజలన్నీ, హాయిగా కూర్చోక. ఏమైనా మంచి పాట పాడమంటారా ?

ఎన్యూ : (మౌనం)

స్త్రీ : ఏమిటి ఆలోచిస్తున్నారు ?

ఎన్యూ : నేను జనాభాలెక్కలు తీసుకుంటానికి వచ్చాను దయచేసి కాస్త మీ కుటుంబ వివరాలు చెప్పాలి.

స్త్రీ : అందుకా మీరు వచ్చింది..... సరే.. ఒక్క తమ్ముడు మాత్రం ఉన్నాడు. కుంటివాడు.. ఏపనీ చేయలేడు.

ఎన్యూ : అయితే...మీ కేమైనా ఆస్తి ఉందా ?

స్త్రీ : అలాటి దేమీ లేదు.. నేనే ఒక ఆస్తిని.

ఎన్యూ , మరీ.. జీవనోపాయం ?

స్త్రీ : ఏదో... నేనే సంపాదిస్తుంటా.

ఎన్యూ : ఏమైనా ఉద్యోగం చేస్తున్నారా ?

స్త్రీ : లేదు.

ఎన్యూ : సరే..... సెలవు..... మీకు చాలా శ్రమ ఇచ్చాను.

స్త్రీ : అప్పుడే.. నేను బాగా పాడుతానండీ .....ఇదుగో.. మిమ్మల్నే...

ఎన్యూ : (తొందర తొందరగా వెళుతున్నట్లు ధ్వని)

స్త్రీ : మొత్తానికి భలే బేరమే తగిలింది. హుఁ...టీ నీళ్లు కూడా దండగే. (మ్యూజిక్)

## 3

ఒక పురుషుడు : ఏమయ్యా, మళ్ళా వచ్చావ్ ? ..ఆమధ్య వచ్చి అన్నీ వ్రాసుకుపోయావుగా......మీ జనాభాలెక్కలు కావుగానీ మమ్మల్ని వేధిస్తున్నారే?

ఎన్యూమ : మీరే అలా అంటే ఎలా చెప్పండి. మీరంతా మాకు సహాయం చేస్తేనే గానీ ఈ జనాభాలెక్కలు సక్రమంగా తేలవు.

పురు : అయితే నన్ను గూడా నీవెంట తిరగమంటావా?

ఎన్యూ : అబ్బే !...మీకు అంత శ్రమ



ఇస్తామా?......మాకు సరియైన సమాధా నాలు ఇస్తే చాలు.

పురు : సరియైన సమాధానాలు ఇవ్వక, నీకు అబద్ధం చెప్పానుటయ్యా.. ఛీ లేవాడి వేసే మొత్తానికి.

ఎన్యూ. కోప్పడకండి సార్... నేను వచ్చి వ్రాసుకుపోయాక మళ్ళీ ఏమైనా జనాభా పెరిగిందేమోనని...

[పిల్లవాని ఏడ్పు]

మీ ఇంట్లో ఎవరిదో పసిపిల్లవాని ఏడ్పు వినబడుతున్నదే?

పురు. మా ఆడవాళ్లు.. మొన్ననే .. ఓరి నీ యిల్లు బంగారంగాను. పుట్టిన పసి గుడ్డును గూడా లెక్కలోకి ఎక్కిస్తున్నావుటయ్యా ?

ఎన్యూ : ఆ.. వ్రాసుకోవాలి సార్!... ఆ.. ఇంకెవరో ముసలమ్మగారుండాలి... ఆమె అప్పుడు జబ్బుగా కూడా ఉంది.

పురు : ఆ...ఆ...ఆమె మాఅమ్మగారు.

ఎన్యూ : వారు ఇప్పుడున్నారా అండి?

పురు : ఓరి శకుని పక్షీ !.. ఛీ...మీనోటినుంచి వచ్చేవన్నీ అమంగళాలే...... అప్పుడే, నాతల్లిని ఆయముడుగాడు లాక్కెళ్లాడనుకున్నావా? ఛీ.. ఛీ...పాపం శమించుగాక.

ఎన్యూ : సెలవు .క్షమించండి

పురు నీ వినయం మండినట్టే ఉంది... పో ..పో

[కొంత నిశ్శబ్దం తర్వాత బూట్ల ధ్వని]

ఎన్యూ : ఏమండోయ్!...ఈ ఇంట్లో ఎవరో పోయారు ట ఎవరండీ?

వేరొక పురు ఎవరైతే నీకేమయ్యా !

ఎన్యూ అబ్బే' మరోహలా అనుకోకండి నేను రాసుకోవాలి.





పురు : మేం పుట్టెడు దుఃఖంలో ఉంటే, నీవు ఈ అజలన్నీ అడుగుతావేమిటయ్యా ?

స్త్రీ : (లోపలినుంచి పిలుస్తున్నట్టు ఉండాలి.) ఏమండోయ్ ఒకసారి ఇలా రండి.

పురు : ఏమిటే.....ఉండవయ్యా... వస్తాను.

స్త్రీ : (రహస్యంగా) రేషనువాడేమోనండీ . మీ తమ్ముడు పోయినట్టు చెబితే, కార్డు లాక్కుపోతాడేమో ? అసలే బియ్యంలేక ఇదవుతున్నాం.

పురు : ఓసి నీ దుంపతెగా—చెట్టంత తమ్ముడు పోగా లేంది. వెధవ రేషన్ కార్డు కోసం ఏడుస్తున్నావా ? ఛీ.. ఛీ.. ఎంత నీచం.. .ఇదిగో నయ్యోయ్.. ..మాతమ్ముడి రేషను కార్డు, తీసుకుపో నాయనా నీకో నమస్కారం చేస్తాను.

ఎన్యూ : నేను రేషనింగు వాడిని కాదండీ...అది వాళ్లకే ఇచ్చివేయండి... సెలవు వస్తా.. .. అమ్మయ్యా !...... గడచి గట్టెక్కాను.. .జనాభా లెక్కలూ జిందాబాద్. ★

# గ్రామఫోను రికార్డు

(8-వ పేజీ తరువాయి)

దండ్రులు పెట్టినపేరు వెంకటసుబ్బారావు. ఇంటి పేరు జైనులు. నవీననాగరికత ప్రకారం అలా మార్చుకున్నాడు. అన్ని విషయాల్లో ప్రాచీనపద్ధతుల్ని కనుకరిస్తూ యీ పేరు విషయంలో నవీన సాంప్రదాయాన్ని ఎందుకు అవలంబించాడా? అని సందేహం వున్నా అడిగితే బాగుండదని వూరుకున్నాను

ఒకరోజు సాయంత్రం అతని యింటికి వెళ్లాను. డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని ఏవో రికార్డులు దంచుతున్నాడు. అవి అంతవరకూ వినివుండను. బహుశా నేను జన్మించకముందు వచ్చిన సినిమాలలోవి అయివుంటాయి.

"ఇవాళ క్రొత్త రికార్డులు తెచ్చాను" అన్నాడు.

"పెట్టండి" అన్నా.

"ఇప్పుడు నేను పెడుతున్నవి అందులోవే శాంతా ఆప్టే పాడింది. చాల బాగుందికదూ."

"అవునవును" అన్నా వినలేక బాధపడుతూ.

"ఇవాళ మీతోపాటు షికారు రానందుకు క్షమించాలి."

"ఏం?"

"క్రొత్త రికార్డులుకదూ! వీటిని వదిలి రాలేను"

"పోనీలెండి. నేను వెళ్తాను."

"పోనీ మీరు కూడ రికార్డు వినకూడదూ!"

"ఎందుకు లెండి. ఊఁ.. అయితే యింక వెళ్తాను" అని లేచి వచ్చేశాను. అయిదారు అంగలు వేసి వుంటాను. అంతలో ఆయన వెనకాలనుంచి పిలిచాడు. వెనక్కి వచ్చాను.

అన్నట్టు మిమ్మల్ని చాలకాలనుంచీ అడుగుదామనుకుంటున్నాను. మీ యింట్లో ఏమయినా రికార్డులున్నయ్యా?"

చచ్చాను ఆ సమయంలో యమునిముందు నిలబడివున్న అపరాధిలాగ వుంది నాపరిస్థితి. ఏమయినా అబద్ధమాడలేక పోయాను.

"ఏవో.. వున్నయి" అన్నా.

ఆయన ముఖంలో చిరునవ్వు మెరిసింది. "ఇంతకాలంనుంచీ చెప్పలేదే మండీ? రేపు ఒకసారి తెచ్చిపెడతారూ?" అన్నాడాయన.

నాదగ్గిర గ్రామఫోనున్నమాట నిజం. అదయినా అర్ధాంగి పోరుపడలేక కొన్నానేగాని నాకిష్టముండి కాదు. సరే ఫోనున్న తర్వాత రికార్డులంటూవుండాలి కదా! అందువల్ల అర్ధాంగిమాట కెదురు చెప్పలేక, విధిగా బ్యాంక్ ఎకౌంటులోంచి నూట యాభయిదాకా తీసేశాను. ఇది అయిదేళ్ల నాటిమాట. ఆ తర్వాత గ్రామఫోను మూలకు చేరింది. ఎందుచేతనంటే దాని స్థానే ఫిలిప్సు రేడియో వచ్చి ఆక్రమించుకుంది.

అంత పాత రికార్డు యివ్వడానికి సిగ్గేసి చిన్న అబద్ధమాడాను. "పాతవి లెవ్వండి. క్రొత్తవి"

అతనిముఖ కవళికలు కొంచం మారాయి. సంతోషించాను. కాని యింతలో కథ అడ్డంతిరిగింది.

"పోనీలెండి. క్రొత్తవంటే ఎంత అయిష్టమయినా పెట్టుకోకూడదని నియమం లేదుగా. ఎందులోవి వున్నాయి?

మహా చిక్కులో పడ్డాను ఈ చిక్కును విడదీసుకోవటం ఎలానో అర్థంగాక "బర్సాత్, ప్యార్‌కీజీత్..." అన్నా.

"సరేలెండి. రేపు సాయంత్రం వచ్చేటప్పుడు పట్రండి" అని లోపలికి వెళ్ళిపోయాడు.

తల దిమ్మెక్కిపోయింది. ఒక చిన్న అబద్ధం ఎంత పనిచేసింది? అందుకనే కాబోలు ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చటానికి నూరు అబద్ధాలు ఆడాలంటారు. అలా అయికూడ కప్పిపుచ్చలేకపోయాను. అయితే యిప్పుడెలాగ? రికార్డులకోసం అబద్ధాన్ని



ఒప్పేసుకోవటమా ? లాభంలేదు. మరి రికార్డులు యీయనకు తెచ్చియియ్యాలా? అది ఎలా సంభవం? అంటే క్రొత్త రికార్డ్లు కొని తెచ్చియ్యాలన్న మాట. ఈ పీడా అంతా లేకుండా వున్నయదార్థం చెప్పేస్తే బాగుండేది కదా ?

ఎలా అయితేనేం యిల్లు చేరుకున్నాను. బుర్రంతా పాడయిపోయింది. సరే చివరికి ఒకటే నిశ్చయించుకున్నాను. మరునాడు వుదయమే బజారవెళ్లి ఆ రెండు సినిమాల్లో రికార్డులు ఒక పాతిక వెచ్చించి తీసుకున్నాను. వీటిని గనక ఆవిడ చూసిందంటే యిల్లుదాటి బయటికిపోవు. అందు వల్ల జాగ్రత్తగా తెచ్చి నా డ్రాయర్ సొరుగులో పెట్టేశాను.

సాయంత్రం అయిదింటికి బట్టలేసుకుని తయారయ్యాను. అయితే ఏం లాభం ?



ఆవిడ ఆ డ్రాయర్ మీదే కూర్చుని వుపన్యాసం దంచుతోంది.

"మన రేడియో పాడయిపోయింది. కర్ణకఠోరంగా వినబడుతూంది. మీరు దీన్ని బాగుచేయించినా సరే. లేకపోతే ఇది అమ్మేసి యింకోటి కొన్నా సరే. మీరు ఎన్నిసార్లు చెప్పించినా వినిపించుకోరు. మీరేమో షికార్లుకొడుతూంటారు. ఇంట్లో మేము కాలక్షేపం కాక చేతులు నలుపుకుంటూ కూర్చోవాలి?...

"ఏమిటి నీ గొడవ. ఇప్పుడేమంటావు?"

"అంతే లెండి మా వన్నీ గొడవలు. బయట తిరిగేవారికి ఏం తెలుస్తుంది మా బాధ. మీరుకూడ యింట్లో కూర్చుంటే తెలుస్తుంది."

"అయితే నీ ఎదురుగుండా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోమంటావా?"

"ఆ మాట నేననలేదు."

"అయితే ఎందుకొచ్చిన తగాదా. లోపలికెళ్లి నీ పని చూసుకో? అన్నా విసుగ్గా.

అదసలే కోపాంతకురాలు. ఏమనుకుందో ఏమో మాట్లాడకుండా వెళ్లిపోయింది. అమ్మయ్య అనుకుని రికార్డ్లు చిక్కించుకుని రెండడుగులు వేశాను.

"ఏమిటది?"

చచ్చాను. హోరి దీని తస్సాదియ్యా! నేను చేసేదంతా పసిగడుతుంది కాబోలు.

"ఏం. . లేదులే" అన్నా బెరుగ్గా.

"ఏమీ లేదంటే? నేను చూడలేదనుకుంటున్నారా" అంటూ చేతిలోంచి లాక్కొని వాటిమీద పేర్లు చూడబోయి హిందీగని, యింగ్లీషుగాని రాని కారణంచేత తెల్ల మొహం వేసింది.

"నేను చెప్పాలా? అవి ఏవో పిచ్చి రికార్డులు. మా స్నేహితుడు డబ్బిచ్చి కొనుక్కురమ్మంటే తీసుకువెళ్తున్నాను" అన్నా.

"పిచ్చివో వెర్రివో! యివాళ యిక్కడ వుంచండి పెట్టుకుని రేపు యివవొచ్చు" అన్నది.

"అబ్బే, బాగుండదు ఈ రెండు రోజులువాడిని పెట్టుకోనీ. ఆ తర్వాత మన మొహానే పారేస్తాడు" అన్నా.

"ఇప్పుడు పెట్టుకోవా లనుంది మరి!"

"అలాగంటే ఎలా? ఎల్లుండికల్లా తీసుకురానూ ?" అని సముదాయించబోయాను.

"చెప్పానుకదూ ? మేమంటే ఎంత నిర్లక్ష్యమో" అని బుంగమూతి వేసుకుని లోపలకుపోయింది. బ్రతుకు జీవుడా అని బయట పడ్డాను

నేను వి. ఎస్. జైన్ దగ్గరికి వెళ్ళేటప్పటికి అతను నాకోసం ఎదురు చూస్తున్నాడు. పాపం రికార్డ్లపిచ్చి అనుకున్నాను. నన్ను చూసి అమాంతంగా ఎగబడి వాటిని లంకించుకుని గ్రామఫోనుకూ, వాటికీ నేస్తం కలిపాడు. అంతవరకూ ఒక్కమాట కూడ మాట్లాడలేదు.

"కాసినే తెచ్చారేం ? యింకా లేవా? నా కొంచెం చిరాకు కలిగింది. పగిలిపోయాయి" అన్నా. అదంతటితో సమిసిపోతుం దనుకున్నా.

"పగిలిపోయాయా ? అన్నీనా ?"

"అవును అన్నీనూ."

"అరె...ఎలాగ ?" అన్నాడు ఆశ్చర్యంగా.

బుర్రకు చక్కని వుపాయం కోసం ఆర్డర్ వేసేశాను. పాపం అది మెతకది కావటం సెకన్లలోనే మంచిమాటను అల్లేసి యిచ్చింది.

"పిల్లి తోసేసింది" అన్నా.

"మరి యివి పగల్లేదేం ?"

పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లాగ అగుపించాడు ఆ సమయంలో. మళ్ళీ బుర్రకు పని కల్పించాను

"ప్రక్కింటివారు అడిగితే యివి యిచ్చాను. అందువల్ల యివి పగల్లేదు."

ఇప్పటికి ఆయన ముఖంలో సంతృప్తి గోచరించింది. మళ్లీ చేతులు గ్రామఫోనుతో జత కలిపాడు.

మరునాడు సాయంత్రం వెళ్లేటప్పటి "సారీ" అన్నాడు. "ఏం?" అన్నాను

"మీరిచ్చిన రికార్డులతో ఒకటి పగిలిపోయింది. వెధవ పిల్లి" అన్నాడు.

ఏమనాలో తెలియక తెల్ల మొహం వేశాను. అతనే అన్నాడు "కొనిస్తాను లెండి. మీరేమీ అనుకోరనుకుంటాను"

"పర్వాలేదు. దానికేముంది లెండి" అన్నా. ఆయనేం మాట్లాడలేదు. ఆరికార్డు పట్టుకుని యింటికి వచ్చేశాను. రాగానే నాచేతులో రికార్డు అందుకుంది ఆవిడ. ఆవిడ ముఖంలో సంతోషం గోచరించింది.

అయిదు నిమిషాలుగడిచింది "ఇదేమిటీ, ఒకటి తక్కువ తీసుకొచ్చారేం?"

ఆరిదిని తస్సాదియ్యా, వెళ్లేటప్పుడు

లెక్క వేసిందన్నమాట. "ఏమో ఎందుకని వుంచుకున్నాడో, పోన్లే" అన్నా.

"పోన్లే ఏమిటి. ఒకసారి అడిగి తీసుకు రండి మళ్లీ యిచ్చేసేదేగా" అంది.

"సరేలే" అన్నా.

అన్నానేగాని అడగలేకపోయాను. వారంరోజులు గడిచాయి. అతనా వూసే ఎత్తటల్లేదు. ఇంట్లో ఆవిడపోరు ఎక్కువయి పోయింది. చూస్తూచూస్తూ నాలుగు రూపాయల వస్తువుకోసం మాట జారవిడువ లేకుండా వున్నాను. అయినా అది వదులుకోవాలని నాకూ్కడ లేదాయె.

ఆ రోజు సాయంత్రం బయలుదేరాను. "ఏమండోయి. ఇవాళయినా తీసుకురండి. రేపు అన్నీ కలిపి యిచ్చెయవచ్చు" ఆవిడగారు జ్ఞప్తిచేసింది. బయటికొచ్చాను. అయినా ఎవరి రికార్డుకోసమో యీవిడకింత ఆరాటమెందుకంట? మరయితే యింకో చిక్కుకూడా వచ్చిందే. ఈ రికార్డు మళ్ళ ఎక్కడకు తీసుకుపోవటం? ఎక్కడకో ఎందుకు? యింట్లోనే వుంచవచ్చు. ఇంట్లో పెడితే "ఎన్నాళ్లకి మీ స్నేహితుడికివ్వరేం?" అని ప్రశ్న వస్తుంది కదా. అందువల్ల వాడికక్కర్లేదుటలే అని చెప్పినా సరిపోతుంది అయినా అప్పుడు అసలు సంగతి చెప్పేసినా యిబ్బంది వుండదు.

నేను వెళ్ళగానే చిరునవ్వుతో ఆహ్వానించాడు. అతనకూడా టాయిలెట్ అయి వచ్చింతర్వాత యిద్దరం షికారు బయల్దేరాం.

మధ్య దారిలో ఎంతో కష్టంమీద బిడియంగా అడిగాను. "మాడండి ఆ రికార్డు విషయం ఏం చేశారు?" అడిగానే కాని చాల నొచ్చుకున్నాను.

మిస్టర్ జైన్ నవ్వుతూ అన్నాడు "సారీ నే నా విషయం ఎప్పుడో మరిచిపోయాను. రేపు కొనిస్తాను లెండి."

మాట పోగొట్టుకున్నానే అని కించగా వుంది లోపల. అందువల్ల "మాడండి. నాకు పెద్ద ఆరాటమేమీ లేదు కాని యీ ఆడవాళ్లతో విషయం బహుపేచీసుమండీ. అసలు సంగతి యీ రికార్డు మా ఆవిడ తన స్వంతడబ్బుతో కొనుక్కున్నది లెండి" అన్నాను సమర్థించుకుంటూ.

"అవునవును" అన్నాడతను.

సగం భారం దిగిపోయినట్లుంది. కాని యిలాంటి సమయాలలోనే చేసిన పొరపాటును కప్పిపుచ్చుకోటానికి ప్రయత్నాలు జరుగుతూ వుంటవి. అది మానవ సహజం. నేనూ మానవుణ్ణే కాబట్టి ప్రక్కనున్న కాఫీహోటల్‌లోకి జొరబడి రూపాయి అరణాలు అర్పించుకున్నాను.

మరునాడు సాయంత్రం బయలుదేరబోయే సమయంలో ఆవిడ కాస్త గట్టిగా చెప్పింది. రికార్డు తెస్తే బంగాళదుంపల వేపుడుచేస్తానంది. నిజంగా నాకు నోరూరింది. లొట్టలేసుకుంటూ బయలుదేరాను. వెళ్లాను. మామూలుగా మాట్లాడాను. కాని అతను రికార్డుసంగతి ఎత్తడే? కృంగిపోయాను. నిజంగా అతనిమీద అమితమయిన కోపం వచ్చేసింది.

"ఇక వస్తానండి" లేచాను రాత్రి ఏడింటికి. భగభగ మండిపోతోంది. ఆకలితో కాదు. కోపంతో.

"వెళ్తున్నారా? అరే. ఆ సంగతే మర్చిపోయానే" అని లోపలికి పోయాడు. ఆత్రంగా చూస్తున్నాను. వచ్చాడు. ఈసారి చేతిలో రికార్డు వున్నది.

"ఆలశ్యమయినందుకు క్షమించండి. ఇదిగో" అని అందిచ్చాడు.

"థ్యాంక్స్" అని చెప్పివచ్చేశాను. పాపం అనవసరంగా ఆగ్రహపడ్డాను. మనిషి మంచి మర్యాదస్తుడు, స్నేహపాత్రుడూను, అనుకున్నాను. ఇంటికి

ఆవిడ రికార్డు అందుకుంది "నాకు తెలుసు. మీరు తెస్తారని" అంటూ. అంటే నేను బంగాళదుంపల వేపుడుకోసం ఎటువంటి పనయినా చేస్తానని నమ్మకం. కుర్చీలో కూలబడ్డాను.

ఆవిడ నిమ్మదిగా గ్రామఫోను మూత తీసింది. కీయిచ్చింది. పిన్ను పెట్టింది. రికార్డు ఎక్కించింది. పెట్టేసింది.

వినబోతున్నాను—

"యక్ దిల్ కే తుక్ డే హజార్ హుయే"

వినిపించింది—

"నాచో నాచో ప్యారేమన్ కె మోర్" ★

# ముక్కుకు సూటిగా పోతే

రామం, సుందరం, గోపాలం, శేఖరం నలుగురూ పార్కులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. అందరూ బియ్యే పరీక్షకు క్రిందటి మార్చిలో హాజరైనారు.

రా : ఏంరా, జూన్ నెల రెండోవారం కూడా అయిపోవచ్చింది. ఇంకా రిజల్ట్సు రాలేదే?

సుం : వస్తయిలేవోయి. ఇవ్వాళ కాక పోతే రేపొస్తయి అంత అదుర్దా దేనికి?

గో : అవును లేరా నీకేం దుర్దాయేమిటి, మాకు గాని. ఫస్టుక్లాసులో వస్తానని ఆ పరీక్షనాడే డంకామీద దెబ్బకొట్టి చెప్పావు

సుం : మీరుమాత్రం తక్కువ తిన్నారా? ఫస్టుక్లాసులో కాకపోతే సెకండుక్లాసు ఖాయంగదా?

శే : అవును లేండోయి మీదంతా కడుపునిండిన బేరము రిజల్ట్సు ఎప్పుడొచ్చినా మీ కిబ్బందిలేదు. బియ్యే డిగ్రీ చేతిలో పట్టుకొని ఉద్యోగంకోసం దేబిరించాల్సింది నేనొక్కడినే గదా!

గో : శేఖరం నీకేమిటోయి నిక్షేపంగా మంచి పర్సనాలిటీ నువ్వూను. నిన్ను పిలిచి ఇవ్వరుటోయి ఉద్యోగం.

శే నీనోటి వాక్యాన ఉద్యోగం పిలిచే ఇవ్వాలిగా నేనీ నోటినిండా పంచదార కుక్కనూ?

రా : వెధవ పంచదార ఎవరిక్కావాలి? జిలేబి, లడ్డూ, మైసూరుపాకు, ఇన్నుంటే పంచదారెవరిక్కాలి? అయినా ఉద్యోగం రాంగానే వదిలిపెట్టామూ, నాలుగయిదు టీపార్టీలన్నా, నీచేతిమీద జరగనియ్యంది?

సుం : వెధవ టీపార్టీ లేమిటిరా? సినిమా అండ్ టీపార్టీ అడగాలి గాని?

శే : అబ్బో గొంతెమ్మ కోరికలు చాలా ఉన్నయ్యే. సరే మీకు టీపార్టీలే, కావాలో, సినిమాపార్టీలే కావాలో అన్నీ లిస్టురాసి ఉంచండి, ఫండ్సునుబట్టి బడ్జెట్టు శాంక్షను చేస్తా. నా ఒక్కడిచేత ఖర్చు చేయిస్తే మిమ్మల్నిమాత్రం నే వదిలిపెడతానూ? ఏంరా, రామం నీకు గ్రూపులో ఏక్లాసు వస్తుందని నీ అభిప్రాయం?

రా : కనీసం సెకండుక్లాసు *Expect* చేస్తున్నానోయ్. ఏంరా శేఖరం ఏం ఉద్యోగం చేద్దామని నీ ఉద్దేశ్యం?

శే ఒక ఉద్యోగమనేమిటి? దేంట్లో ఛాన్సు దొరికితే దాంట్లో దూరటమే? మనకు ఛాయిస్ కూడా ఒకటేడ్సింది?

నలుగురు స్నేహితులూ దాదాపు రెండు దశాబ్దాలు చూసారు వారి విద్యార్థి దశ ఇప్పుడే ముగిసింది. జీవితంలోకి అడుగు పెట్టబోతున్నారు. శేఖరంతప్ప మిగతా ముగ్గురూ, కాస్తో కూస్తో, వెనక ఉన్న

రచన:

## 'శ్రీ రాగి'

వారు. వారు ఉద్యోగం చేసినా, చెయ్యక పోయినా, దిగులు లేదు. శేఖరంతండ్రి, చదువుకోసం తాతలనాటి ఆస్తి అంతా పోగా మిగిలిన అర ఎకరం ఆ సంవత్సరపు టారంభములో తెగనమ్మాడు. బియే ప్యాసయిన తర్వాత యేదయినా ఉద్యోగం దొరక్కపోతుందా అనే ధీమాలో ఉన్నాడు. ఆయనకు శేఖరం ఒక్కడే కొడుకు వేరే సంతానం లేదు అప్పటికే, ఆస్తి లేకపోయినా పిల్లవాడు చదువుకొంటున్నాడు, అని సంబంధాలు వస్తున్నయి. ఏదో ఒక ఉద్యోం దొరికితే, వివాహం కాస్తా అయిందని సిద్ధామని శేఖరంతండ్రి ఆలోచించాడు.

తరువాత నాలుగు రోజులకు రిజల్ట్సు పడ్డయ్యి సుందరం గ్రూపులో ఫస్టు క్లాసులో వచ్చాడు. శేఖరం, రామం' గోపాలం కూడా ప్యాసయినారు థర్డు క్లాసులో

శేఖరం ఉద్యోగం కోసం తన వూరిలో అన్ని ఆఫీసులూ తిరిగాడు కొన్ని ఆఫీసులలో టెంపరరీ ఖాళీలు ఉంటే అప్లికేషన్లు పెట్టాడు గాని రికమెండేషను లేని అప్లికేషను లాభం లేదని త్వరలోనే గ్రహించాడు. ఎటొచ్చీ సర్వీసు కమీషనొకటుంది. ఆ పరీక్షకు హాజరైనాడు. ఎలాగో సెలెక్టయినాడు రెవన్యూ డిపార్టుమెంటుకు మరి మూడు నాలుగు నెలల్లో అపూరి తాలూకా ఆఫీసులోనే తనకి ఉద్యోగం యిచ్చారు. కొడుకుద్యోగి అయినాడని తండ్రి సంతోషించాడు. వచ్చిన సంబంధాలలో యేదో ఒకటి చూసి, ఆ వివాహం కాస్తా అయిం దనిపించాడు. శేఖరం ఆదర్శ భావాలు కలవాడు. కట్నం దమ్మిడీకూడా అడగలేదు. మామగారే తన యిష్టమువచ్చినంత డబ్బు కట్నం క్రింద ఇస్తానన్నాడు. శేఖరం అది కూడా తీసుకోలేదు. ఆ డబ్బు పెట్టి మామగారు తన కూతురికి నగలు చేయించాడు.

శేఖరంకి క్రొత్తలో గుమాస్తా నౌకరి కొంచెం కష్టం అనిపించింది ఒక్క టేవర సర పదకొండు గంటల నుంచి అయిదు గంటల దాకా కుర్చీలో మెషినులాగ కూర్చొని పని చేసేటప్పటికి మొదట్లో నడుము నొప్పి పట్టేసి కొంచెం అవస్థ పడ్డాడు. కాలక్రమేణా చాకిరీకి అలవాటు పడ్డాడు

శేఖరం ఉద్యోగంలో ప్రవేశించటం మరొక టెంపరరీగుమాస్తా ఉద్యోగం ఊడటం ఆ నాడే జరిగినయి. తన పొట్ట కోసం యింకొకని పొట్ట కొట్టాల్సొచ్చింది. తనేం చేస్తాడు? అతని ఉద్యోగం పోతుందని తన కాళ్లదగ్గర కొచ్చిన ఉద్యోగం కాల తన్న గలడా? అంత త్యాగానికి మనదేశపు యువకులు ఇంకా అలవాటు పడలేదు.

అతను తన సీటులో ఉన్న ఫైల్సు పెండింగు పేపర్సు ఛార్జీ వప్పగించి వెళ్లిపోయినాడు మూడు నాలుగు రోజులు వరసగా కూర్చొని ఫైల్సు కాగితాలు చదవటమే సరిపోయింది. కాని మొదటిరోజున అంతా గందరగోళంలా ఉంది. తన బియ్యే పరీక్షకూ, ఆ కాగితాలకూ, ఆకాశానికీ, భూమికీ ఉన్నంత తేడా ఉంది. తోడి

గుమాస్తాలను తెలియని పేపర్లను గురించి అడిగాడు. కాని ఒక్కడూ నోరు తెరిచి ఇది ఫలానా, ఇది ఇట్లా చెయ్యాలి, అని చెప్పిన పాపాన పోలేదు.

రోజూ ముప్పది నలుబది కాగితాలు వచ్చి పడుతున్నాయి. అవన్నీ ఏం చెయ్యాలో తనకేం బోధపడటం లేదు. హెడ్ గుమాస్తా, శేఖరం వంక చూసి "ఏంటయ్యా బియ్యే ప్యాసయినానంటావు? యిదేనా నీ తెలివి? ఆ మాత్రం పని తెలియని వాడివి ఉద్యోగం ఎందుకు నీకు? చూడు అపాడ్సు చూడు? అవన్నీ నే చూసు కోవాలి? క్రొత్తగా వచ్చిన ప్రతి వాడికీ పని నేర్పుతుంటే నా పని అయినట్టే. అయినా ఈ కాలం కుర్రాళ్లతో ఇదే చావు. బియ్యేలు ప్యాసవుతారట బియ్యేలు. ఒక చిన్న డ్రాఫ్టు రాయలేరు? ఎందుకొచ్చిన బియ్యే డిగ్రీ?" అని నోరు చప్పరించాడు.

ఈ మాటలకు శేఖరానికి చాలా కోపం వచ్చింది. కాని యేం చేస్తాడు? మీరన్నది తప్పంటే, ఉద్యోగం ఊడకొడతాడేమో? అయినా ఈ హెడ్ గుమాస్తా మొట్టమొదటి రోజున పని నేర్చుకునే ఉద్యోగంలో చేరాడు కామోసు. ఎవరూ చెప్పందే క్రొత్తఆఫీసులోని పని యెట్లా తెలుస్తుంది?

తాసీల్దారు మొదటివారంలోనే శేఖరాన్ని పిలవమన్నాడు తన రూములోకి. శేఖరం ఎదురుగా తాసీల్దారు రూములోకి వెళ్ళి నమస్కారంచేసి, ఆయన టేబిలు మీద చేతులు వేసి నిలబడ్డాడు.

"ఏమయ్యా, పనేమన్నా చేస్తున్నావా లేదా? నీ దగ్గరనుంచి ఒక్క కాగితం యింతవరకు రాలేదే? అదేమిటి బల్లమీద చేతులు పెట్టావు? *Manners* తెలీదా యేం? దూరంగా నిల్చో!" అని అదలించాడు కుర్చీలో కూర్చొన్న తాసీల్దారు.

తాసీల్దారు అదలింపుకు శేఖరం చాలా ఫీలయి, బల్లమీద చేతులుతీసి దూరంగా నిల్చొన్నాడు

"కాగితాలు చూస్తున్నాను సార్. పని యిప్పుడిప్పుడే తెలుస్తున్నది." అని మెల్లగా జవాబిచ్చాడు.

"జాగ్రత్తగా పని నేర్చుకో. కాయితాలన్నీ రెండుమూడు రోజులలో జవాబు వ్రాసి పట్టుకురండి."

"అలాగే సార్" అన్నాడు శేఖరం.

"ఇక మీరెళ్లి పని చూసుకోండి" అన్నాడు తాసీల్దారు.

'బ్రతికాంరా బాబూ'అనుకొని శేఖరం రూము యివతలకు వచ్చి తన సీటులో కూర్చొని పని చూసుకొంటున్నాడు.

ఎలాగయితేనేం శేఖరం క్రిందా మీదా పడి రెండు నెలలలో పని తుణ్ణంగా నేర్చుకున్నాడు. లంచం తీసుకోటం తప్పని మొదటినుంచీ శేఖరం ఉద్దేశ్యం. అనేక విషయాలలో పార్టీలు అతనికి డబ్బియ్య పోయినారు కాని అతను తీసుకోలేదు. తాలూకాఫీసు గుమాస్తా, లంచం తీసుకోకపోవటం పార్టీల కాశ్చర్యం కలిగించింది. ప్రతి గుమాస్తా, ప్రతివాడినీ పీడించి డబ్బు గుంజుతుంటే, శేఖరం ఇచ్చినా తీసుకోకపోతే ఆశ్చర్యం కలగదూ మరి? తోడిగుమాస్తాలు ఏదో పని వంక పెట్టుకుని రోజూ తాసీల్దారుయింటికి వెళ్లి దర్శనం చేసుకొంటూ ఉంటారు. శేఖరాని కది గిట్టదు. శుష్క నమస్కారాలు, నక్క వినయాలూ దేనికంటాడతను. తన పని తాను సవ్యంగా చూసుకుంటూ ఉంటే అధికార్లేం చేస్తారనే తరహా అతనిది. అతను సరిగా ఆఫీసుకు పదకొండుగంటలు కొట్టుతుండగా వస్తాడు. అక్కడినుంచీ కుర్చీకి అంటుకుని అయిదు గంటలదాకా వంచిన తల ఎత్తకుండా తన పని చేసుకుపోతాడు. తోటి గుమాస్తాలతో అవసరమయితే తప్ప మాట్లాడడు. అయిదు గంటలు తాలూకాలో కొట్టినతర్వాత ఇంక ఆఫీసులో ఒక్క నిమిషంకూడా ఉండడు. తాసీల్దారు కచేరి నుంచి ఇంకా వెళ్లకపోయినా అతను లెక్క చేయడు.

హెడ్ గుమాస్తా, తోటి గుమాస్తాల లాగే పూర్వకాలపు వాడు. బూజు పట్టిన భావాలు అతనిలో నాటుకొని ఉన్నాయి. బానిసత్వం పూర్తిగా అతని ప్రతి రక్తనాళంలోనూ అతి వేగంగా ప్రవహిస్తూ ఉంటుంది. తాసీల్దారు ప్రశ్నల కాయన 'చిత్తాలు'తో జవాబిస్తాడు. 'అండి' లేనిది వాక్యం పూర్తిగాదు. చేతులుకట్టుకుని నిలబడతాడు ఆఫీసరు ముందు. నిండుగా తలగుడ్డ చుడతాడు. చక్కగా మొహాన తిలకం దిద్దుతాడు. నీరగాయధోవతి వెళ్లగోచితో బిగిస్తాడు. పాత, చిరిగిన బొంత కోటొకటి తగిలించుకొంటాడు చొక్కామీద. ఆ అవతారంలో అతనిని చూస్తే వేరే గంగిరెద్దుని చూడనవసరంలేదు. ఆఫీసరు ముందు ఎంత వినయం చూపిస్తాడో తనక్రింద గుమాస్తాల మీద అంత అధికారం చూపిస్తాడు. అతనికి మిగతా గుమాస్తా లందరూ బెదుర్తారు శేఖరం తప్ప. అందుకే శేఖరాన్ని చూస్తే హెడ్ గుమాస్తాకి కన్నెర్ర. ఆఫీసరు యింటిపను లందుకోటంలో అతని తర్వాతే ఎవరైనా.

'హెడ్ గుమాస్తాగారూ, ఇవ్వాళ్ల మా అమ్మాయిని ఫలానా స్కూలులో చేర్పించండి' అంటే నిముషంలో ఆపని ముగించుకొస్తాడు. ఆఫీసరుయింట్లో ప్రతి శుభకార్యానికి మేనేజిమెంటు అతనిదే.

శేఖరాన్ని చూస్తే గిట్టకపోవటానికి, ఇంకొక కారణం కూడా ఉంది. మిగతా గుమాస్తా లంతా, తృణమోపణమో సంపాదించుకొని, దాంట్లో కొంత హెడ్ గుమాస్తాకు భాగం యిస్తారు. శేఖరం అసలు లంచమే తీసుకోకపోతుంటే హెడ్ గుమాస్తాకు భాగం ఎక్కడనుంచి తెచ్చి యిస్తాడు? హెడ్ గుస్తాకు అందువల్ల తనకు



వచ్చే రాబడిలో కొంత తగ్గినట్టే కదూ! మరి ఇంకా ఆయనకు కోపం వచ్చిందంటే ఎందుకురాదు? ఆయన సమయంకోసం ఎదురు చూస్తున్నాడు. ఆఫీసు కాగితాలలో ఎక్కడన్నా దొరుకుతాడేమోనని చూశాడు. కాని లాభం లేకపోయింది. శేఖరం తన బల్లమీద పెండింగు పేపరంటూ ఉంచేవాడు కాదు.

ఒక రోజున శేఖరం అయిదుగంటలకు ఆఫీసునుంచి సూటిగా పార్కుకు వెళ్లి కూర్చున్నాడు రేడియో వింటూ. అప్పటికింకా తాసీల్దారు ఆఫీసులోనే ఉన్నాడు.

హెడ్‌గుమాస్తా ఇదే అదననుకొన్నాడు. ఉదయమే వచ్చిన టపాలో ఒక అర్జంటు పేపరు శేఖరానికి యివ్వవలసింది యివ్వకుండా తన దగ్గరే పెట్టుకొన్నాడు.

తాసీల్దారు ఇంటికి వెళ్లబోతూ, ఆ అర్జంటు కాగితానికి జవాబు వ్రాశారా” అని హెడ్‌గుమాస్తాని అడిగాడు.

'లేదుసార్. ఆ కాగితం శేఖరంగారిది. ఉదయమే ఆ కాగితమతనికి పంపించాను సమాధానం రాయమని.' అన్నాడు హెడ్‌గుమాస్తా చేతులు నలుపుకుంటూ

'మరెందుకాయన రిప్లైయి వ్రాయలేదు? అని తాసీల్దారు ప్రశ్నించాడు.

“ఏమోసార్? రెండుసార్లు నే నతనికి జ్ఞప్తి కూడా చేశాను. ఆయన నన్ను లక్ష్యపెట్టలేదు. అయిదు గంటలు కొట్టగానే ఆఫీసునుంచి వెళ్లిపోయినాడు!” అన్నాడు తాసీల్దారు వంక చూసి.

'అర్జంటు కాగితమంటే అంత నిర్లక్ష్యమా?' అని ఉగ్రుడైనాడు తాసీల్దారు.

శేఖరం ఎక్కడున్నా వెతికి తీసుకు రావలసిందని జవాన్ను పంపించాడు తాసీల్దారు. శేఖరంయిల్లు, ఆ పరిసరప్రాంతాలు జవాను చూశాడు కాని శేఖరం ఎక్కడా



నుపించలేదు. జమాను పార్కుకు వెళ్ళాడేమో నని పార్కుకువెళ్లి చూస్తే, శేఖరం పార్కులో రేడియో వింటూ కూర్చున్నాడు.

"రండి సార్! మిమ్మల్ని అర్జంటుగా పిలుచుకు రమ్మన్నారు తాసీల్దారుగారు"

"ఏమంత కొంపమునిగిందింతలో? ఇప్పుడేగదా నేను ఆఫీసునుంచి వస్తున్నది" అన్నాడు శేఖరం ఆశ్చర్యంతో.

"ఏమో సార్, నాకేమీ తెలీదు. మిమ్మల్ని అర్జంటుగా పిలుచుకు రమ్మన్నారు వస్తారా, రారా" అని కొంచెం దబాయింపుగా అన్నాడు.

శేఖరం ఒక క్షణంసేపు ఆరోజు తనకు టపాలో వచ్చిన కాగితాలను జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. వానిలో ముఖ్యమయినవాటికి కాగితాలు వ్రాసే, తనిటొచ్చాడు. మరియింక తనను తాసీల్దారు అర్జంటుగా రమ్మన్న కారణ మేమయి ఉంటుంది? అతని బుర్రకు ఎంత ఆలోచించినా స్ఫురించలేదు.

విధిలేక బలవంతంగా కాళ్లీడ్చుకొంటూ జమానుతో తాలూకాఫీసు చేరాడు. గుండెలో దడదడగా వుంది.

ఆఫీసులో అడుగు పెట్టగానే, హెడ్ గుమాస్తా, భీకరాకారంతో కళ్లెదుట కనుపించాడు.

"ఏమయ్యా, ఉదయం నేను యిచ్చిన ఆ అర్జంటు కాగితం అలా బల్లమీద వదిలి పెట్టిపోతే యేమనుకొన్నావు? ఆ కాగితానికి సమాధానం ఈనాడే పోవాలని నే చెప్పలేదూ? ఇపుడు తాసీల్దారుగారు, దానికి జవాబు పోలేదని చిందులు త్రొక్కుతున్నారు. యేం జవాబు చెప్తావో, పోయి చెప్పుకో." అని హెడ్‌గుమాస్తా పిడుగులు పడ్డట్టుగా అరిచాడు.

శేఖరానికంతా అయోమయంగా వుంది. దారీ, తెన్నూ తెలియటంలేదు.

"అదేం కాగితమండీ? అది చెప్పకుండా అనవసరంగా మాటలంటా రెందుకు?" అని ఎలాగో ఊపిరి తిప్పుకొని అడిగాడు.

"ఇంకా యేం తెలీనట్లు మాట్లాడతావేమయ్యా అయిదు గంటలకే ఆఫీసునుంచి ఉడాయించి," అని కసిరాడు.

"..........."

"అట్లా నిల్చుంటావేం? నీ బల్లమీద చూడు, ఆ కాగితం లేదూ?" అని రెట్టించాడు హెడ్‌గుమాస్తా.

శేఖరం తన బల్లదగ్గర కెళ్లి చూశాడు. పైన ఒక కాగితం పేపరు వెయిట్ క్రింద పెట్టిఉంది. అది చేతిలోకి తీసుకొని చూశాడు. దానిలో 'పొలిటికల్ సఫరర్సు' వాళ్లకు, గడచిన అర్ధ సంవత్సరంలోనూ, మంజూరు చేసిన భూములూ వగైరాలను గురించిన వివరాలను' వెంటనే తిరుగుటపాలో పంపమల ఉంది. శేఖరం నిర్ఘాంత పోయినాడు. ఆ కాగితం తనకు ఉదయాన హెడ్ గుమాస్తా అసలివ్వనే లేదు. వెంటనే డిస్ట్రిబ్యూషను రిజిష్టరు చూశాడు. ఆ కాగితం మీద వేసి ఉన్న నంబరు, తను ఉదయం తీసుకొన్నట్లు సంతకం పెట్టిన కాగితాల నంబర్ల తరువాత నంబరు. ఇప్పుడర్థమయింది శేఖరానికి హెడ్ గుమాస్తా తనని చివాట్లు పెట్టటానికి చేసిన తంతు. నంబర్ల కెదురుగా తను తీసుకొన్నట్లు సంతకం పెట్టిన తరువాత, వాటి క్రింద ఈ క్రొత్త కాగితపు నంబరు కూడా చేర్చాడు. ఇప్పుడీ సంగతి తను తాసీల్దారుతో చెప్పినా నమ్మడు. ఇంక చేసే దేముంది? హెడ్ గుమాస్తా అరుపులకు నోరు మూసుకొని పడి ఉండటమే.

వెంటనే తనసీట్లో కూర్చొని కాగితానికి జవాబు వ్రాయటం ఆరంభించాడు. ఆ కాగితాలు ఈ కాగితాలు మాని జవాబు వ్రాసేటప్పటి గంటకు పైగా బట్టింది. ఈలోగా తాసీల్దారు తన ఆఫీసులో చిర్రుబుర్రు మంటున్నాడు. నాలు గయిదుసార్లు పని అయిందేమో చూడమని జమానును పురమాయించాడు. ఆఫీసరు నెత్తిమీదకూర్చొని ఈ పని వెంటనే చెయ్యి అని అంటే ఆపని చెయ్యటం ఎంత ప్రాణాంతకమో శేఖరానికిప్పుడు తెలిసొచ్చింది.

చివరికి కాగితం పూర్తిచేసిపాడులో పెట్టి తాసీల్దారు గదిలోకి వెళ్లాడు.

తాసిల్దారొక్కసారి సింహంలాగర్జించాడు.

"మేమయ్యా, 'రిటరన్ ఆవ్ పోస్టు' కాగితం బల్లమీద పెట్టి అయిదు గంటలకే ఆఫీసునుంచి చెక్కేస్తే, ఈ పనంతా ఎవరు చేస్తారనుకొన్నావ్"

శేఖరం దిగజారి పోయినాడు. మొహం పాలిపోయింది.

"ఏదో పొరపాటయి పోయిందిసార్ ఈ సారికి క్షమించండి" అని తాసీల్దారును ప్రాధేయపడ్డాడు.

"మరొకసారిలా జరిగిందంటే, నీ ఉద్యోగం ఊడుతుంది. జాగ్రత్త" అని మందలించాడు తాసీల్దారు.

శేఖరం హెడ్ గుమాస్తా చేసిన కుట్రను బయట పెట్టలేదు. నమ్మకపోవటం అటుంచి, ఇంకా బాగా చివాట్లు పెడ్తాడేమోనని భయపడ్డాడు.

తాసీల్దారు సంతకం చేసిన తర్వాత కాగితాలు తీసుకొని అక్కడనుంచి బయటపడి ఆ అర్జంటు కాగితం టైపుకిచ్చి టైపు చేయించి హెడ్ గుమాస్తాచేత సంతకం చేయించి డిస్పాచ్ గుమాస్తాకు డిస్పాచ్ కిచ్చి, ఇంటిదారి పట్టాడు.

ఈ అవమానానికి శేఖరం బాగా క్రుంగిపోయినాడు. కాని ఆ ఉద్యోగం కాదని ఎక్కడికి పోగలడు? ఎవరిస్తారు మళ్లీ ఉద్యోగం? గుమాస్తా ఉద్యోగానికి దిగిన తర్వాత ఆఫీసరు ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక మిషమీద తిట్టక మానడు. అందుకభిమాన పడితే పొట్ట ఎలా గడుస్తుంది? ఆఫీసర్లకు, తాళం వేస్తారు, ఈ హెడ్ లెస్ గుమాస్తాలు. 'హెడ్‌గుమాస్తా' లనటంకన్న, వాళ్లను హెడ్ లెస్' గుమాస్తాలని పిలుస్తే, సార్థకనామధేయులవుతారు.

శేఖరానికి తను ఒకప్పుడు ఉబుసుపోకకు చదివిన రవీంద్రనాథ్ టాగూరు కథ మెదడులో మెదిలింది. అందులో రవీంద్రుడొక గుమాస్తా దురవస్థను వర్ణిస్తాడు. ఇంట్లో పిల్లవాడు జబ్బుగా ఉన్నాడుట, గుమాస్తా చేతిలో మందుకు కానీలేదు. రాత్రంతా ఫైళ్లకట్టలు ముందు వేసుకూర్చొని తెల్లవారంగానే ఆ కట్టలతో ఆఫీసుకు వెళ్లి సాయంత్రందాకా పని చేస్తాడుట. ఇంతలో అతని అధికారి అతనిని ఒక ముఖ్యమైన కాగితానికి జవాబు వ్రాసి బంగళాకు పట్టుకు రమ్మంటాడు. జవాబు వ్రాసి ఆ ఫైలు బంగళాకు తీసుకుని వెళ్లేటప్పటికి చీకటి పడుతుంది. లోపల యింటిలోని పిల్లవాడు యెలా ఉన్నాడోనని బెంగ. ఒక ప్రక్క ఆఫీసరు పనిచెయ్యక పోతా యేమంటాడోనని భయం. బంగళాకు వెళ్లితే, అధికారి అరగంట తర్వాత గాని దర్శనం యివ్వలేదు గుమాస్తాకు. తరవాత ఫైలు తిరగేసి గుమాస్తాని 'ఫూల్, యూస్, స్కౌండ్రల్' అని ఆంగ్లపద భాషాజాలమంతా ఉపయోగించి తిడతాడుట. అప్పటికీ ఆ గుమాస్తాలో చైతన్యం కలగలేదు. ఆ తిట్లన్నీ మౌనంగా భరించి ఇంటికి వెళతాడుట. ఇంటిదగ్గర భార్య భర్తకోసం ఆదుర్దాతో ఎదురుచూస్తూ ఉంటుంది. వుత్తచేతులతో మందూ, మాకూ

లేకుండా వచ్చిన భర్తనుచూసి కోపం పట్టలేక భర్త నవమానానిస్తుంది. అప్పుడు భర్తకు తన స్థితి అర్థమయి, చైతన్యంవచ్చి, శరవేగంతో, అధికారి బంగళాకు వెళ్లి, లోపల జొరబడి, సుఖంగా పడక కూర్చీలో ఆసీనుడయిన, అధికారికి, అంతకుముందు తనను తిట్టిన తిట్లన్నీ వడ్డీతో అప్పగించి, అధికారిని చావచితకకొట్టి బయటపడ్తాడు. ఆ కథలో గుమాస్తాకు ఏంత ఓర్పున్నదో, అంత ఓర్పు ఆధారంగా తీసుకొని అధికారులెలా గుమాస్తాలను బాధిస్తారో, రవీంద్రనాథ టాగూరు చక్కగా వివరింపగల్గారు.

శేఖరానికి తను చదివిన కథ కళ్లకు కట్టినట్టయి. కళ్లల్లో నీరు తిరిగింది.

కాలచక్రంలో రెండుమూడు సంవత్సరాలు గిర్రున తిరిగినయి. శేఖరంభార్య కాపురానికి వచ్చింది. శేఖరం తండ్రి ప్లీడరుగుమాస్తా చేస్తూ వృద్ధాప్యంలో ఇంక పని చేయలేక ఉద్యోగంనుండి విరమించాడు. తండ్రి, తల్లి, తన నాయనమ్మ, తన భార్య తనను పోషించుకోవాలి శేఖరం తనకొచ్చే స్వల్ప జీతంతో. జీతం యేమూలకీ చాలటం లేదు. నెల కిరవైరోజులు గడవటమే గష్టంగా ఉంది. తిండే గడవకపోతే. తన సంసారానికి గుడ్డ లెక్కడ నుంచి కొంటాడూ! తన ఆఫీసులో ప్రతి గుమాస్తా మూడు గంటలకు తప్పనిసరిగా అల్పాహారశాలలకు వెళ్తారు. ఆ సమయంలో తన కడుపులో కాలుతునే ఉంటుంది. ఖాళీ బాకీ జేబుతో కడుపెలా నిండుతుంది? అలాగే మాడుతున్న కడుపుతోనే పనిచేసుకుంటూపోతాడు.

ఈ మూడు సంవత్సరాలలోను ఆఫీసులో అనేక ఘోరాలు జరిగినయి. శేఖరానికి కళ్లు ఉండీ లేనట్లు ప్రవర్తించాల్సివచ్చింది. కిరసనాయిల్ కంట్రోలు పెట్టినప్పుడు, కిరసనాయిల్ కోటా యిచ్చిన ప్రతి గ్రామంలో ప్రతి షాహుకారువద్ద కొట్టుకింత అని మామూళ్లు గుమాస్తాలు, తాసీల్దార్లు వసూలు చేసుకొన్నారు. కాఫీహోటళ్లకు పంచదార కోటా యిచ్చినందుకు నెలవారీ మామూలు అధికార్లకు ముట్టాల్సిందే యిప్పటికీ. ఎవరైనా శుభకార్యాలకు పంచదార కిరసనాయిలు కావాలని పెట్టుకుంటే, మామూలిస్తేనేగాని గుమాస్తా దగ్గరనుంచి కాయితం కదలదు. ఒక కాగితం విషయంలో లంచం తీసుకోటానికిగాని, ఇయ్యటానికిగాని ఆధారాలు లేనప్పుడు కూడా ఆ కాగితం విషయంలోనే డబ్బు చేసుకున్న మహామేధావులున్నారా ఆఫీసులో.

శేఖరం రెవెన్యూటెస్టు ప్యాసయిన తర్వాత ఎలాగో మరొక ఫిర్కాలో రెవెన్యూ ఇనస్పెక్టరుగా వేశారు. ఈ రెవెన్యూ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం కూడా, తనకన్న జూనియర్లకందరికీ అయిన తర్వాతనే, తనకయింది. మరి అధికార్ల నాశ్రయించనివాళ్ల గతి అంతేగదా!

రెవెన్యూ ఇన్‌స్పెక్టరు ఉద్యోగంలో అతను ప్రజలలో నిజాయితీకి పేరుబడ్డాడు. పంటలు అంచనా వేసేటప్పుడు, తను స్వయంగా పొలంవెళ్లి చూసిగాని, ఆ అంచనా వెయ్యడు. ఇలా ఇతను కరణాలు వేసిన పంటల అంచనా తనిఖీకి బయలుదేరే టప్పటికి దొంగ కరణాలు బయటపడ్డారు. కొన్నికొన్ని మెట్టప్రాంతాలలో పైరే లేదని రిజష్టరులో వ్రాసియున్న చోట, యే మొక్కజొన్నో, కందులో, దివ్యంగా పైరు అగుతుండేవి. అది చూసి శేఖరం ఆశ్చర్యపోయేవాడు. రెండుమూడు సార్లు దెబ్బతిన్న తర్వాత కరణాలు తమ తప్పుడు అంచనాలు, దొంగ లెక్కలు మానారు. యే గ్రామంలో అతను పని ఉండి వెళ్లినా రాత్రికి తప్పకుండా ఇంటికి తిరిగి వచ్చేవాడు. అతను అనవసరంగా కరణాలను తనభోజనాల విషయంలో తిప్పలు పెట్టేవాడు కాదు. ఖర్మంచాలక కరణాలయింట్లో భోజనం చెయ్యాల్సివస్తే, భోజనపు ఖర్చు మరునాడు తన జవాను చేత కరణాలకి పంపించేవాడు. అప్పుడప్పుడు తాసీల్దారు అతను ఉన్న ఫిర్కాకు క్యాంపువచ్చి మూడు నాలుగు రోజులు మకాము వేసేవాడు. పాపము శేఖరం తాసీల్దారుకు ఎలాగో భోజనపు యేర్పాట్లు యే కరణంచేతనో చేయించి, తాసీల్దారు తిరిగివెళ్లిన తర్వాత, అయిన ఖర్చు బిల్లుచేయించి, తాసీల్దారుకు పంపేవాడు. ఆ బిల్లు చూసి తాసీల్దారు బిత్తరపోయేవాడు. ఇంతవర కెప్పుడూ క్యాంపు ఖర్చులకు బిల్లు పంపిన కరణాలని, ఇన్‌స్పెక్టరును, తాసీల్దార్లు ఎరగరు. కాని వారికి బిల్లు చెల్లించక తప్పేదికాదు. ఇన్‌స్పెక్టర్ల ద్వారా అప్పుడప్పుడు ముట్టే మామూళ్ళు, శేఖరంద్వారా యే తాసీల్దారుకు ముట్టలేదు. అందుకనే శేఖరం తాసీల్దార్ల ఆగ్రహానికి గురి అయినాడు. తాసీల్దార్ల చేతిలో ఉన్నాయి 'కాన్‌ఫిడెన్షియల్ ఫైల్సు.' వాటిలో శేఖరాన్ని గురించి 'చాలా అసమర్థుడని, పొగరుబోతనీ, సరిగా పని తెలియదనీ, ఉన్నతోద్యోగాలకు 'తగడని' ఇంకా యేమోమో చెడామడా వ్రాశారు. కాన్‌ఫిడెన్షియల్ ఫైల్సులో గుమాస్తాలపట్ల '*Intelligent*' అనే పదం యే భావంలో ఉపయోగిస్తారో, ఆ ఆఫీసర్లకే తెలియాలి.

కరణాల చిన్న చిన్న అలవెన్సులూ, వారి దొంగ లెక్కలూ చూస్తే, వారిపట్ల ప్రభుత్వవిధాన మేదో శేఖరానికర్థమయేది కాదు. అంత చిన్న అలవెన్సులతో అంటే షుమారు ఇరవైరూపాయలలోపు అలవెన్సులతో కరణాలు తమ జీవితాలను గడపాలంటె, ఆ గ్రామప్రజల సహాయం

(43-వ పేజీ చూడండి)

# శ్రాద్ధం

"ఏమండీ, ఈ పూటైనా మన ఘరానా కాస్త నిలపెట్టండీ!"

"ఏం ఘరానా?"

"రాకరాక వచ్చారాయె, వియ్యంకుడు, వియ్యప్రాలూను. మళ్ళీ జోడుగా ఎప్పుడు వస్తారో. మీరు రివెన్యూ ఇన్‌స్పెక్టరుగా వున్న వూళ్ళోవాళ్లకి ఎక్కడికి వెళ్లినా ఛత్రాలు ఎత్తుతారనుకుంటూంటారు!"

"అయితే, ఏం చెయ్యమంటావ్?"

"అదిగో! ఇందాకణ్ణుంచి మొరపెట్టినది గాలిలో ఎగిరిపోయిందీ!......ఊళ్లో దేముడి తిరునాళ్లు జరుగుతున్నాయి. మళ్లీ ఏడాదికి కాని రాదు. వచ్చినా, వారిద్దరు ఆమూల రాజమండ్రీనుంచి ఈకడప జిల్లాకి - ఈరాళ్ళదిబ్బకి - రావడం పడుతుంది కనకనా? కాస్త బండికుదిరిస్తే, అంతావెళ్లి చూసొద్దాం, సరదాగా."

"మంచి ఊహేమరి. అయితే బళ్లని ఎక్కడనుంచి తెమ్మంటావ్? అన్నింటికీగిరాకీ ఎక్కువైపోయిందాయె, ఈ తిరునాళ్ళమూలంగా. బళ్ళవాళ్లు రేట్లు తెగపెంచేశారు...సరి చూద్దాం..."

భార్య జానకమ్మ సలహామీద ప్రక్కవూళ్లో జరుగుతూన్న తిరునాళ్లకి వెళ్లడానికి సన్నాహం చేశాడు రివెన్యూ ఇన్‌స్పెక్టరు రామయ్య. తన ఆఫీసు బంట్రోతు మామకు ఎద్దుబండి వుండడం తెలుచుకున్నాడు. వెంటనే బంట్రోతు చేత కబురు పంపించి తెప్పించాడు దాన్ని, మరెవరో కుదుర్చుకోబోతూంటేను. అంతా గబగబా బండిదగ్గరికి వచ్చారు. వియ్యప్రాలు జానకమ్మ లోపల కూర్చున్నారు; వెనుకవైపు వియ్యంకుడు, రామయ్య కూర్చున్నారు.

'టుర్ర్'మని ఎద్దును అదలించి, గంతి జానకమ్మవైపు కూలపడ్డాడు బండివాడు. చిన్నబండేమో, లోపల నలుగురికీ ఘటాఘటీగా సరిపోయింది. ముందు కూర్చున్న బండివాడికి జానకమ్మకి మధ్య బెత్తెడు మాత్రం స్థలంవుంది! రామయ్యకి మూరెడు బాకు గుండెలో పొడిచినట్లనిపించింది!!

కొంచందూరం వెళ్లిందో లేదో - ఉన్నట్టుండి బండివాడు "అయ్యో! బండి తేలిపోతూంది; కాస్త ముందుకి జరగాలండి." అన్నాడు. బండిలోని ఆడవాళ్ళకి మొగాళ్ళకీ మధ్య పిసరంతైనా ఎడం ముందేలేదు. ఏకొంచమైనా ఆడాళ్ళే ముందుకు జరగాలి. నిస్సంకోచంగానే జానకమ్మ ముందుకు 'ఊఁ' అని జరిగిందేమో అంతకుముందు 'బండివాడి'కీ 'ఇన్‌స్పెక్టరు పెళ్ళా'నికీ మధ్య వుండే బెత్తెడు భేదం తొలగిపోయింది! పాపం, జానకమ్మ తన వీపు బండివాని వీపువైపు పెట్టి కూర్చుంది ఎల్లాగో. ఈ దృశ్యం కళ్లబడేసరికి రామయ్యకి వంటినిండా జర్రులు పాకినట్లయింది. అమాంతంగా నమిలి మింగేద్దామన్నంత కోపం వచ్చింది బండివాడిమీద. "వెధవ పోకిరీసజ్జు" అని పళ్లు పటపట లాడించి, బుర్ర 4, 5 సార్లు క్రిందికీ పైకీ ఆడించి, ఒక్క ఉడుకు నిట్టూర్పువిడిచి కూర్చున్నాడు. అమాంతంగా ఒక ఆలోచన తట్టింది. "తనే వెళ్లి ఆచోట కూర్చుంటేనో? వియ్యప్రాలుకి ఎదురౌతుంది కద! పోనీ వియ్యప్రాలును తన స్థలంలోకి పంపించి, ఆమె స్థలంలో జానకమ్మను కూర్చోబెట్టి, బండివాడిప్రక్క తను కూర్చుంటేనో? ఇంతెందుకు తన భార్యని వెనక్కుపిలిచి ఆ స్థలంలో వియ్యంకుణ్ణి కూర్చోబెడితే?..."

**శ్రీ కర్రా ప్రభాకరరావు**

మళ్ళీ ధైర్యం చాలిందికాదు. గుమ్మడికాయల దొంగంటే భుజం తడుముకున్నట్లవుతుందనుకున్నాడు. వాళ్లు నలుగురూ ఏమనుకుంటారో అని శంకించాడు. "అయినా ఉత్సవాల్లోనూ, జనసమ్మర్దంలోనూ ఇటువంటివి తొంభై జరుగుతూంటాయి. ఏదో కాస్సేపు కాలక్షేపం చేస్తే పోతుంది" అని మనస్సును బలవంతంగా సంతృప్తిపరచడానికి ప్రయత్నించాడు. బండి చరచరా నడుస్తూనే వుంది. గుడికి ఇంకో అరమైలు దూరంవుంది.

ఇంతట్లోకే బండి కాస్త పైకి గెంతబోయి క్రిందికి కూరుకుపోయింది. బండివాడు వెంటనే "అమ్మా కాస్త ముందుకి రావాలి" అని అరిచాడు. "ఈ కాస్సేపూ సర్దుకోక తప్పుతుందా" అన్నట్లు తల ఊపి జానకమ్మ, ముందుకి ఎట్లా జరగడానికి వీలుంటుందా అని తడుముళ్ళాడుతూంది. రామయ్యకి కోపం ఛివాలున నసాళం అంటిపోయింది; పట్టలేకపోయాడు. ఈ గలాభా ప్రయాణాన్ని ప్రోత్సహించినందుకు ఒక్క అగ్గిచూపు బండివాడిమీదుగా భార్యపైకి పోనిచ్చి 'జరగక్కర్లేదులే' అన్నట్లు కనుబొమ్మలు నొక్కాడు. ఆవిడ అది గమనించకపోవడం, ఆమె నిర్లక్ష్యం చూసేసరికి ఆయన కోపానికి కట్టలు తెగాయి. 'ఆగు!' అని ఉరుముతూ గభీలున దూకాడు రోడ్డుమీదికి. హఠాత్తుగా దూకాడేమో, బండికాడి, ఒక్కసారి పైకెగిరి భూమిలోకి కూరుకుపోయి ఎద్దుమెడ నొక్కేసింది నేలమట్టానికి. చటాలున బండివాడు క్రిందికి ఎగిరిపడి, కాడి ఎత్తుతూ, ముఖం చిట్లించి, చురచురా చూశాడు రామయ్యకేసి 'ఏంపని చేశావయ్యా' అనే అర్థంలో. ఆ చూపు అందరినీ ఆకర్షించడంకూడా రామయ్యకళ్లపడింది. తనవారిముందు తన్ని - ఇన్‌స్పెక్టర్ని అంత ఈసడింపుగా చూడడం రామయ్యకి నెత్తిమీద తన్నినట్లయింది. అగ్నికి ఆజ్యంతోడైనట్లుగా దీంతో ఆయన కోపం రవ్వలు వెళ్లకక్కింది. నోరు కట్టుకోలేకపోయాడు. బుగ్గలు విరిచి, నాసికాపుటాలు పూరించి, కళ్లు బారుచేసి, నుదుట ముడుతలు తేల్చి, కనుబొమలు దట్టించి, కర్కశస్వరంతో, గుక్కతిప్పకుండా విసిరాడు. "వధాబండీ నువ్వూను. ఇందాకటినుంచి తెగచూస్తున్నాను - పోకిరీతనమూని! ఇద్దరికి చాలని బండిలో నలుగుర్నెక్కించి పైగా తనూ ఎక్కుతాడూ! ఊరికే ముందుకి 'జరుగు, జరుగు' అంటే ఎక్కడికి జరిగేది నా నెత్తిమీదికి? పోతులా వున్నావు; బండిలో ఆడాళ్లప్రక్క ఇరుక్కోకపోతే కాస్త నడిచి తోలరాదూ? కాళ్లరిగిపోతాయా?" బండిలోవారంతా దిగి "అసలు సంగతేమిటి?" అన్న ప్రశ్నార్థకపు మొహాలువేసి చూస్తున్నారు, ఓసారి రామయ్యకేసి మరోసారి బండివాడికేసీను.

ఇక ఈ ప్రవాహానికి అంతున్నట్లు కనిపించకపోయేసరికి, బండివాడు కూడా ప్రవేశించాడు రంగంలోకి. "ఏమిటోయి! మాటలుమాత్రం సరిగ్గారానీ! ఇన్‌స్పెక్టరు

గోరయితే తలొంచుతాం గానీ, ఇల్లా సావతిడితే నోరుమూసుకూరుకో నేవోళ్లం గాదయ్యోయి! ఎథాబండంట! ఎథా బండిమీ దెక్కమని ఎవడు బతిమిలాడేడో?" అన్నాడు నిరసనంగా, ఎద్దును నిమురుతూను.

బండివాడు అనుకున్నాడు – "మా అల్లుడికి కామందుఅయితే, ఏం, ఊరిదీయత్తాడా? బంట్రోతుద్యోగానికి ఈయన కాకపోతే ఈయన జేజమ్మ ఇంకోడు! ఇంతకుముందు చేసిన ఉపకారం అంటూ ఓటి ఏడిసిందా, ఇకముందు సెయ్యాదేమో అన్న భయానికి! ఉపకారం సెయ్దలసుకున్న మనిషికి ఎవరూ ఏంచెయ్యాక్కర్లేదు! ఉపకారబుద్ధి లేనివోర్ని ఎంత మంచి చేసుకున్నా కుక్కతోక సాపుసేసినట్టే! ఇంతదూరం వచ్చాక బండిదిగి ఎక్కడికడతారు? పోతే పోనీ; డబ్బులు కాస్తా ఒడుక్కుని 'టింగురంగా' అంటూ ఇంకోర్ని కుదుర్చుకుంటాను ఈ రోజుల్లో కూలికి కరువేంటి? ఈ ధైర్యంతోటే రామయ్యాని ఎదిర్చి మాటలనేశాడు.

రామయ్య ఈసారి కాస్త తమాయించుకునే, వానిని ఎగాదిగా చూస్తూ గంభీరంగానే అన్నాడు. "ఏమి నీ పొగరూ?" బండివాడు విసుగుతో అన్నాడు "బాబూ! మీకు వెయ్యిదణ్ణాలు. చాలు. నా రేటు కాస్తా నాకు పారేండి. నే పోతాను... మంచి బేరం తగిలిందీ మద్దాన్నం పూట!"

రామయ్య కాళ్లు దడదడ వణికాయి. పెదిమలు గబగబ కదిలాయి. నుదుట ముచ్చెమటలు క్రమ్మాయి. బండివాడు తన్నింత నీచపరుస్తాడనుకోలేదు. ఒళ్లు కోపంతో దహించుకుపోతూంది. తనవారి ముందర, తన ఇన్స్పెక్టరీ ఘరానా చూపిద్దామనుకున్నచోట, తనకీ పరాభవమా? వాడి అల్లుడు తన చేతిక్రింద వుండడంతో వీడూ తన చేతిక్రిందివాడే కదా అనే అహంభావంతో తప్పితే అంతగా నోరు జారివుండేవాడు కాదు. తన్ను చూసి, ఆదరభక్తులతో బండి తోలుతూనే తనుపక్కనేనడుస్తూ, నెమ్మదిగా కుదుపులు లేకుండాతోలి, ఉత్సవంఅయిందాకా వేచి వుండి, తిరిగి పిలిచి తమందరినీ ఇంటిదగ్గర దిగపెట్టి, తను విసిరిన డబ్బులు ఏరి నెత్తి కొంగున దోపుకుంటూ, 'ప్రభువుల దయ' అని, దండాలు పెడుతూ శలవు తీసుకుంటాడని – ఊహాసౌధం – తన ఘరానాప్రదర్శనపు 'రిహార్సలు' – వేసివున్నాడు, ఇన్స్పెక్టరు రామయ్య! తన కాలిక్రింది గడ్డిపోచ తన నుదిటిముందర పాములా బుసలు కొడుతుందేం!

ఇక వాణ్ణేమన్నా తగ్గేస్థితిలో లేడు. నలుగురూ చేరి అసలువిషయం కాస్తా తెలుసుకుంటే పైగా తనకే ఇంకా తగని అవమానమాయిరి. ఉత్సవస్థలం అట్టే దూరం లేదు. నడిచిపోతూనే వున్నారాయె చాలామంది. వచ్చేటప్పుడు ఏదోవిధంగా చూసుకోవచ్చు – అనుకున్నాడు. అప్పుడు, లేని గాంభీర్యం తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు – "ఏయి! ఆశే మితిమీరి ప్రసంగాలు చెయ్యాక, నీ బండీ నువ్వూ దారి పుచ్చుకోండి. ఇదిగో నీ డబ్బులు" – అంటూ మూడు అణా కాసులు మూడుమాట్లు, నిర్లక్ష్యంగా, వాడి కాళ్లముందర పడేటట్టుగానే, దుమ్ములోకి విసిరేడు. బండివాడు అమాంతంగా ఆ మూడణాలు ఒకేసారి ఆ దుమ్ముతోటే ఎత్తి, రామయ్య ముందరికి విసిరి గిరాటేశాడు. దుమ్మునుంచి తప్పించుకుంటూ ఒక్కసారి తనవాళ్ళకేసి చూశాడు ఆత్రంతో రామయ్య, వాళ్లు గాని ఈ దృశ్యం చూడలేదుగదా అని.

ఈ పీడ ఎట్లా వదులుతుందిరా అన్న చీకాకుతో "అయితే ఎంత కావాలంటావు, నువ్వు? మేము మామూలుగా గుడికి కట్టించుకుంటే ఇచ్చేది పావలా. సగందూరం వస్తే బేడ. పైగా నీ అతి తెలివి తేటలకి ఇంకో అణా ఇస్తే చాల్లేదేం?" అన్నాడు రామయ్య.

"ఆఁ......అఁ! ఆ రోజు లెళ్ళాయి. ఇది తిరునాళ్ల రోజులండి. రూపాయికి ఒక్క 'బొట్టు' (కానీ) తగ్గితే కదిలేదు లేదు" అన్నాడు ఆయనకేసి చూడకుండానే, ఎద్దును మసాదుచేస్తూ, బండివాడు.

"రూపాయే!" అన్నారు ఒక్కసారి అంతా! జానకమ్మ సాహసించి అందుకుంది. "చూడబ్బీ! నీకు సబుబూ గిబుబూ ఏమీ లేదేమిటీ? ఏనాడైనా కంట చూశావా, రూపాయి బండిరేటు? నాలగణాల కూలికి రూపాయి తెమ్మంటావు, ఆశకంతులేదూ?"

"అది కాదమ్మగోరు! తిరునాళ్ళరోజులాండి మరి. రూపాయిన్నరకి కూడా పొద్దుటేళ బండితోలాను. తమ రట్టా శలవిస్తే ఎట్లా? ఈ సమయంలో కాకపోతే మరెప్పుడండి కరువురోజులికి నాలుగు డబ్బులెనకేసేది?" అన్నాడు అతి వినయంగా, అరచేతిలో అరచేయి వేసుకొని.

భార్యతో అంత వినయంగా మాట్లాడ్డం తన్నింకా అవమానించాలనే చేశాడని రామయ్య నమ్మాడు. తను ఎంత వాదించినా రూపాయికి తక్కువ దిగేటట్లు లేదువాడు. వెనకనుంచి ఎవరో ఘరానా కుటుంబీకులు రెండెడ్ల బండ్లలో వస్తున్నారు. ఇక ఆగక జానకమ్మ, ఓ అర్ధరూపాయి కాసుతీసి వాడి దగ్గరసా వెళ్లి వాడిచేతిలో నొక్కిపెట్టి "వెళ్ళమ్మా నీతో ఏమిటి! వాదం మాకు" అంది పుల్ల విరిచినట్టుగా. "నువ్వైతే ఇది తీసుకునేవాణ్ణే కాదు" అనే ఈసడింపు చూపు ఒకటి రామయ్య

వైపు పారేసి, బండివాడు, చెంగున బండిని గెంతిస్తూ పరుగు తీశాడు.

రామయ్య అవమానం మరపింపచేద్దామనే ఉద్దేశంతో వియ్యంకుడు "ఈపాటికిరీ సజ్జు ఇంతేనండి; మర్యాదగా బతిమాలితే రూపాయి తీసి పారెయ్యరూ మీరూ!" అన్నాడు. "ఆఁ! అదే నేననేదీనూ!" రామయ్య డాంబికంగా అని, "సరే చూస్తాను రేపటినుంచీ వీడు బండి ఎల్లా తోలుతాడోను ఈ వూళ్లో" అని బుస కొట్టాడు. జానకమ్మ అపవారిస్తూ అంది. "బాగానే వుంది; వాడికి కాస్త కూడు పెట్టిపంపోయి, కూడుపెడతాడతా నంటా రేమిటి?"

"అపెడతాను, కూడుకాదు; వాడి శ్రాద్ధం!"

* * *

మరి ఐదుసంవత్సరాలు గడిచాయి. క్షామదేవత రుద్రదేవతలా, రాయలసీమను శ్మశానసీమ చేసి, తాండవ నృత్యం చేస్తూంది. అది ప్రభుత్వశక్తులకు మించిన ప్రకృతి శిక్ష రాయలసీమ వాసులకు. ఆ నృత్యాన్ని కళ్లార తిలకిస్తూ, ఆ దేవతకు అసంఖ్యాకంగా మానవ బలి ఇవ్వవలసిందే. మృత్యుపథం వెంబడి ప్రయాణం జోరుగా వుంది. కాయకష్టంమీద బతికేవారి నోటి కూటికి అడ్డుపడింది. భిక్షాటనను ఏహ్యంగా చూసి కాయకష్టానికైనా ఒడబడ్డ వారి ఇప్పుడు అభిక్షాటన తప్ప వేరు గతి లేక పోయింది. ముష్టి ఎత్తే వాళ్ళ జనాభా గట్టుకట్టిన ఏరులా పెరుగుతూంటే ఎవళ్లు ముష్టి వేసేవారు? క్షామ నివారణకేంద్రాల్లో పోసే గంజి ఆకొన్న పొట్టకి ఏకోనకి?

ప్రభుత్వం క్షామనివారణ పరిశీలనాధికారిగా నియమించింది రామయ్యను. కలెక్టరు, రివెన్యూ అధికారులవద్దనుంచి వచ్చేవి ఎక్కువ నివారణో పాయాలే. అంతకంటె ఎక్కువగా వచ్చి కుప్పలుగా పడుతున్నాయి సానుభూతి తీర్మానాలు. ప్రభుత్వం ఎంతధనం గ్రాంటుచేస్తూన్నా సముద్రంలో కాకి రెట్టవుతోంది. భారీ ఎత్తున నివారణ ఏమీ సాగలేక పోయిందనే చెప్పాలి. రామయ్యరోజూ ఆఫీసుకువెళ్లి ఆనాటికి జరిగిన కార్యక్రమం 'పరిశీలించి' వస్తూనేవున్నాడు.

ప్రభుత్వం నిర్మించిన 'అనధికార సలహా సమితి'లో-భర్త అధికార ప్రభావంచేత కామోసు-జానకమ్మ కూడా సభ్యురాలే. కాని సలహాసమితి సమావేశానికి ఓనాడు హాజరయిన పాపానపోలేదు. అసలా సలహా సమితి సమావేశం అయినట్టే కనిపించదు.

అప్పుడే ఒక రిద్దరికి ముష్టివేసి లోనికి పోబోతూ, ఎదుటినుంచివచ్చే భర్తనిచూసి గుమ్మంలోనే ఆగి, మందహాసంతో స్వాగతంయిస్తూ ఓ చీటి అందించింది జానకమ్మ. ప్రక్క జిల్లా పరిశీలనాధికారి తన్ను చూడడానికి తనింటికి వస్తున్నట్టు ఇంకో గంటలో పెళ్లాన్ని వంటకొంచం 'అసాధారణం'గా చేయమని పురమాయించి తన కచ్చేరీ గదిలోకి వెళ్లాడు. డ్రాయరుదులిపి, కాలింగుబెల్లూ, సిరాబుడ్లూ కలాలు వాటి వాటి స్థలాల్లో పెట్టాడు. ఇంగ్లీషుభాలోని 'భారతీయ ఆధ్యాత్మిక గ్రంథాలు, శీర్షికలు కనపడేట్లా, అమర్చాడు టేబిలుమీద. ఓ ఇంగ్లీషు గ్రంథం సంగం తెరిచి బోర్లించాడు బల్లమీద. క్షామనివారణ రికార్డుల ఫైళ్లు ఓ డజనుబల్లకి రెండుప్రక్కలా అమర్చాడు.

అది సాధారణంగా రామయ్య ఇంటిలో వుండే సమయంకాదు. ఆయన ఆఫీసులో ఉండే సమయంలోనే ఎవరయినా ముష్టి వాళ్ళు ఆయ నింటికి సాహసించి వస్తూండడం, జానకమ్మ లేదనకుండా ఏవో రెండు గింజలు వాళ్ళ గిన్నెల్లో రాలుస్తూండడం జరుగుతూండేది.

ఆనాడు, ఆ సమయంలో వంటలన్నీ అయాక బియ్యం ఏరుతూంది నట్టింట్లో జానకమ్మ. తన అతిథికోసం వేచిఉన్నాడు రామయ్య తన ఆఫీసు గదిలో.

ఆ సమయంలో పేగులు బైటపడ్డ దేహం, వెన్నునంటే పొట్ట, కనుబొమ్మలకు అంగుళం లోతుకు పోయినకళ్ళు, గోతులుపడ్డ దవడలు, పొట్టురాలే వళ్లు, పిట్టలు పీకిన తాటి టెంకలాటి జుట్టుతో-ఒక 'కంకాళసముండు' దేహాన్ని ఈడ్చుకుంటూ తెచ్చి వారి యింటిముందు సైడుకాల్వ పక్కకి చేర్చాడు. హీనస్వరంతో వినపడీ వినపడనట్టుగా, అస్పష్టంగా అరిచాడు. "...మ్మా! ...కాస్...గంజి...పో...."

జానకమ్మ ఎందుకో బయటికి రాబోతూ ఈ దృశ్యం చూసింది; హృదయం కరిగిపోయింది. గభీలున లోపలికివెళ్లి భర్తతో అంది. "కాస్త చల్ది మెతుకులు వాడి ముందర పడేద్దురూ. చచ్చేట్లా వున్నాడు. నాది తీరా మడి బట్టయిపోయింది!"

"నన్ను మాట్లాడించకిప్పుడు...ఈ భిక్షుగాళ్ల సంతలో ఎంతమందికని వెయ్యడం?" ఆమె కేసి తిరక్కుండానే ఉరిమి, తను కాగితాలు తిరగెయ్యసాగాడు మామూలుగా.

విసుక్కుంటూ, లోపలికి వచ్చి చీర మార్చి, భర్త కండువా ఒకటి గభాలున మొలకీ, మెడకీ చుట్టబెట్టుకుంది. ఒక దొన్నెలో పట్టెడన్నం వేసి గబగబా వీధి గుమ్మం చేరువకి వచ్చింది. నలుపక్కలా ఒకసారి కలయచూసి, తల వంచుకుని సరసరా సైడుకాలవ పక్కకి వెళ్లి ఆ దొన్నె వాడిముందర పడేసి చివాలున వెనక్కి తిరిగింది. అలా తిరుగుతూండగానే వాడి ముఖం కనిపించి ఒక్కసారిగా నివ్వెర పోయి ఆగిపోయింది. తటాలున మళ్లీ తనబట్ట వైపు ఓసారి చూసుకుని చరచరా లోపలకి నడిచి, భర్తగది దాటుతూ "పాపం. ఆనాటి బండివాడండీ" అంది.

"ఏ బండివాడు?"

"ఆనాడు కడపలో తగాదా పడ్డ..."

"ఆఁ! వాడా! అయిందీ! రోగం కుదిరింది! ఎవడికోసం అనుభవిస్తాడూ?" ఊహాపథంలో ఒక్కసారి ఎగిరి అయిదు సంవత్సరాల క్రితం తన కవమానం జరిగిన స్థలంలో వాలాడు. ఒక్క సంగతే జ్ఞాపకం వస్తూంటే ఒకొక్కక్క వేడి నిట్టూర్పు బుస గొట్టే మీసాలుమీదుగా విడుస్తూ తల ఊచసాగాడు. "ఏడీ? ఎక్కడ?" అంటూ విసురుగా వీధిలోకి దారితీశాడు. ఎదురుగా నేలమీద చాచుకుపడివున్న బండివాడిని సమీపిస్తూనే 'ఏదో అనబోయి "అరె!" అని నోట్లో వేలు నొక్కుకుంటూ నిలపడిపోయాడు!

నిర్భయంగా దొన్నెలోని అన్నంతింటున్నాయి కాకులు!!



# తీరని కష్టం

శ్రీ చెరుకువాడ శ్రీరామమూర్తి

ఫారెష్టు ఆఫీసర్ని కలుసుకోవడానికి వెళ్లి రహదారీ బంగళా రెండో భాగంలో శాంతమ్మను చూశాను. ఆమె సీనియర్ ఇన్స్పెక్ట్రిస్ ఆఫ్ స్కూల్సు హోదాలో నేను విష్ చేస్తే తెలియనట్లు నటించడమే నాకు ఆశ్చర్యం కలిగించింది.

బంట్రోతు కుర్చీ తెచ్చి వరండాలో వేసి "దొరగారు స్నానం చేస్తున్నారు! పది నిమిషాలు కూర్చోండి!" అన్నాడు.

కుర్చీలో కూలబడి శాంతమ్మ కథ చెప్పకున్నాను!

మా చింతచెట్టు దొడ్లో చిన్నడు మరో యిద్దరి సాయంతో కర్రలు కోస్తుండేవాడు. మా రామం నేను ఆడుకోవడాని కక్కడికి వెళితే "చిన్న షావుకారుబాబు.......... దూరంగా వుండండి బాడిత తగులుతుంది" అనేవాడు కర్రచెక్కటం ఆపివేసి. మేం దూరంగా వెళ్లి చూస్తూ నిలుచుండేవాళ్లం. కర్ర ఒకప్రక్క బల్లపరుపుగా చెక్కి కాగురురంగు నీళ్ళతో ముంచిన నూలు జోడుతో నూళ్ళు వేసి... మధ్యనూలుకు తూకంకట్టి - కర్రబోర్లించి రెండవవైపు కూడా బల్లపరుపుగా చెక్కి నూళ్ళు వేసేవాళ్లు! తరువాత చిన్నడు "సర్దుకోండిరా! ౧ం డెక్కింది" అనేవాడు. తక్కినయిద్దరు తలపాగాలు సవరించుకొని గోతి మీద అడ్డంగా వేసిన బాజుల మీదికి నూళ్లు వేసిన కర్రను ఎక్కించి గోతిలోనికి దిగేవాళ్లు. చిన్నడు రంపం తీసికొని కర్రమీదకెక్కి రంపం కర్ర మందలమీదనుంచి క్రిందికి దింపేవాడు. క్రిందనున్నవాళ్లు రంపం తొక్కి పిడి బిగించాక కోత ఆరంభమయ్యేది.

పైన కోస్తున్న చిన్నడు, క్రింద లాగుతున్న ఇద్దరు కూడా రంపం జోగురు రంగుగీత తప్పిపోకుండా, కోస్తుండే వాళ్లు. మాటిమాటికీ చిన్నడు ముక్కుమీదికి లేస్తుండేది రంపం! అయినా... చిన్నడు... జోగురు రంగు గీత మీదే దృష్టి స్థిరంగా వుంచి... రంపం క్రిందికి త్రోసేవాడు. ప్రతిసారి రంపం చిన్నడి ముక్కులో గుచ్చుకుపోతుందనే భయంకన్నా వాని స్థిరత్వం నన్ను ఆశ్చర్యంతో ముంచేది.

స్కూల్లో పెద్ద తరగతి చదువుతున్న రోజుల్లో! ఓనాడు చిన్నడు వచ్చి మా నాన్నగారితో "నా భార్యపోయింది... నాపిల్లలు నేను ఏం కావాలి బాబు" అని ఏడ్చాడు. అప్పుడు తెలిసింది చిన్నడికి ముగ్గురు ఆడపిల్లలు, యిద్దరు మొగపిల్లలు అని!

శాంతమ్మ; మేరీ; ఎమిలీ; వరసగా ఆరో ఫారము అయిదో తరగతి నాలుగో తరగతి చదువు తుండేవాళ్ళు. వీళ్లంతా స్కూల్లో నాకు తెలుసు కానీ చిన్నడి కూతుళ్లు కొడుకులు అని తెలియదు. జార్జి ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నాడట.

నాన్నగారు చిన్నడికి పాతిక రూపాయలిచ్చి పంపించారు. తల్లిలేని పిల్లల్ని... రంపం కోతమీద వచ్చే కొద్ది ఆదాయంతోనే చిన్నడు పోషిస్తూ చదివిస్తుండేవాడు. స్కూల్లో వాళ్లకి జీతం ఉచితమే. ఐనా పుస్తకాలకు బట్టలకు భోజనాలకు అయ్యే ఖర్చు భరించవలసి వచ్చేది. అందుకోసం... చిన్నడు మధ్యాహ్నం తక్కిన ఇద్దరి కోతగాళ్లతో భోజనానికి విశ్రాంతికి ఇంటికి పోకుండా చింతచెట్టు క్రింద కూర్చొని రంపం పదును పెడుతూ వుండేవాడు.

నేను కాలేజీలో చదువుతున్న మూడేళ్లు చిన్నడి జీవితచరిత్ర తెలియదు. శాంతమ్మ మాత్రం ఒకరోజు కనిపించి, తాను మిషను వాళ్ల సహాయంతో కాలేజీలో చేరానని చెప్పింది.

నలభైరెండులో నాన్నగారు చనిపోయారు. నేను కాలేజీ వదిలేసి రెండేళ్లయింది. నా జీవితంలో పెద్ద మార్పు కలిగింది. అప్పటివరకు బడిపిల్లవాడి ననుకుంటున్న నా మీద సంసారం... బరువు పడింది.

చిన్నడు రంపం కోస్తూనే వున్నాడు. కానీ పాపం సంవత్సరము క్రితం పెద్ద జబ్బు పడ్డాడట. మనిషి చాలా నీరశించాడు! అకస్మాత్తుగా ముసలితనం పైబడింది. శాంతమ్మ బి. ఇ. డి., చదువుతోంది. మేరీ స్కూల్లో పెద్ద తరగతిలోనికి వచ్చిందని చిన్నడు చెపితే విని సంతోషించాను.. పిలిప్పును చదువు మానిపించి, రంపం పనిలో పెట్టాడు...!!

"కొడుకుని రంపంకోతలో పెట్టి కూతుళ్లని చదివిస్తున్నావా?" అన్నాను... చిన్నడు మాట్లాడలేదు.

ఆ సంవత్సరం నవంబరులో శాంతమ్మ నాకో వుత్తరం వ్రాసింది... స్టైఫండు ఇంకా రాలేదనీ... తను వెంటనే హాస్టలు ఫీజు చెల్లించకపోతే హాస్టల్లో వుండనీయరనీ ... అందుకుగాను నన్ను ధనసహాయం వేడింది ... అందులో అవే సంగతులు చిన్నడికి వ్రాసి పంపింది. చిన్నడికా వుత్తరం చూపి వాడిని బాధ పెట్టడం దేనికని... మరునాడు శాంతమ్మకు నూరు రూపాయిలు పంపించాను.

తరువాత సంవత్సరానికి శాంతమ్మకు ఆడపిల్లల బళ్లో వుద్యోగమయిందని చిన్నడు చెప్పాడు! "ఏమి పంపుతున్నదిరా?" అని నే నడిగితే "దాని బ్రతుకది బ్రతుకుతున్నదండి" అని ముఖం త్రిప్పకొని జవాబు చెప్పాడు— పాపం వాడి ముఖంలో.. కష్టం... చేసిన... నీరసం కనిపించింది. అయినా కొందరు జీవితమంతా త్యాగం చేస్తేనేగాని.... వాళ్ల సంతానం అభివృద్ధిలోనికి రాలేరేమోనని నా భయం...

"దొరగారు రమ్మన్నారండి! అన్నాడు బంట్రోతు వచ్చి... ఆలోచనలనించి మేల్కొని... లోపలికి వెళ్లాను. చిన్నడింకా రంపం కోస్తూనే వున్నాడు... వానికి కూతుళ్లను విద్యావంతుల్ని చేసిన సంతోషమే మిగిలింది కాని మామూలు కష్టం తప్పలేదు. ★




# ★ బొమ్మల కొలువు ★



రచన:

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

పాపాయిపెట్టింది బొమ్మలా కొలువు
అందరిని పిలిచింది బొమ్మలా పెళ్లికి
అందరూవచ్చారు అతిథులుగాను
సావిత్రివచ్చింది. నగలమర్చింది
సీతమ్మ వచ్చింది, కుంకుమాదిద్దింది
పార్వతితెచ్చింది పప్పు బెల్లాలు
లక్ష్మమ్మ వచ్చింది పట్టుకోకలతోను.
అందరూవచ్చారు, ఆటలాడారు.
రెండు జట్లుగవీడి, పాటపాడారు.
బొమ్మలాకొలువు కిలకిలామంది.
పాపాయి ముదముతో పకపకామంది
వాళ్లమ్మవచ్చింది, మురిసిపోయింది.



# అహింసా పరమో ధర్మః

ఓరి సామెత బహు మంచి సామెత. మన పూజ్య బాపూజీ ఈ అహింసా వ్రతంతోనే మన దేశదాస్య శృంఖలాలను విచ్ఛేదంచేసి స్వాతంత్ర్యం సంపాయించాడు. బుద్ధుడు బోధించినది కూడ యీ అహింస యొక్క సారాంశమే. ప్రతిమానవుడూ కూడా యీ వ్రతం ఆచరించాలి. కాని అహింసఅనే బురఖా వేసుకుని తడిగుడ్డతో పీకలుకోసేయడంకాదు. ఈ క్రిందికథ బురఖావాలా విధానానికి చెందినదే.

ఆవాళ మకర సంక్రాంతి దినం. పండగదినం గనుక ఆదినం పిల్లికి సుష్టుగా భోజనం లభించింది. అందుచేత పిల్లిగారు ఖుషీగా షికారుకు బయలుదేరారు. చిట్టచివరకు ఊరవతలమామిడితోపు చేరుకుంది. బాగా మేసి మేసి నక్కకూడా ఆతోపే చేరింది. ఇద్దరికి కడుపులు నిండుగా ఉండబట్టి సంభాషణలు సరదాగా ఆరంభించాయి. చిట్టచివరకు అహింసగూర్చి వాదోపవాదాలారంభించాయి ఆమాంసం తినని శాకాహారులు. పిల్లి తన అరమోడ్పు కన్నులతో యీ విధంగా పలికింది: "నక్కబావాజీ, మనం యింతవరకూ యెన్నో జీవాల్ని హింసించాం, వాటిఉసురు మనకు తగలకపోదు. నాలుగు వేదాలుకూడా అహింసా పరమో ధర్మః అని చెప్తున్నాయి. ఈపవిత్రదినం మొదల్కొని మనం జీవహింస చేయకూడదు. అంతే కాకుండా మనమొక సంఘం స్థాపించి దానికి అహింసా సంఘం అని నామకరణం చెయ్యాలి" అని పల్కింది. ఆ పిల్లిగారి రాగానికి నక్కగారు తాళంవేయడం మొదలెట్టారు.

రచన:

## శ్రీ ఆకెళ్ళ వెంకటరెడ్డి

ఇంతట్లో ఒకతోడేలు ఆ ప్రదేశం చేరుకుంది. దానికావాళ యెక్కడా తిండి దొరకలేదు. ఇల్లాగ ఆలోచిస్తూవుంటే తోడేలు కొక గొర్రెపిల్ల అగుపించింది. దాంతోటి తోడేలు దానిని పట్టుకుని "నీవు గాకున్న, నీదుతండ్రి" అని పలికి అమాంతం చప్పరించేసింది. ఈ దురన్యాయంకళ్లారా గాంచిన నక్క,పిల్లీ హరి, హరీ!కృష్ణ కృష్ణా? అని చెవులు మూసుకొని సానుభూతి తెలియజేశాయి.

మళ్లా తిండివేళ అవడంచేత అటునక్క, యిటు పిల్లీ బయలుదేరాయి ఆహార సంగ్రహణానికి ఇలా వెళుతూ వుండగా నక్కకి ఒక చక్కటి కోడిపెట్ట కన్పించింది. దాంతో నక్కకు నోరూరసాగింది. ఇవాళ్టికి అహింసా వ్రతం ఆపు చేసేద్దాము. లేకపోతే చక్కటి ఆహారం పోతుంది అని నక్క తన నిగ్రహాన్ని సడలించి కోడిపెట్టని పొట్ట పెట్టుకుంది.

ఇంక పిల్లిగారి సంగతి. వారు అలాగవెళ్లి వెళ్లి అవధాన్లుగారిల్లు చేరుకున్నారు. అక్కడ చూరులో భలే పసందయిన యెలకని కనిపెట్టింది. దాంతో నోటోని గ్రంథులు జోరుగా పనిచేయనారంభించాయి. రహస్యంగా యీ యెలకను తిసేద్దామనే ఉద్దేశంతో అమాంతంపైసలాచేసింది.

పిల్లి నక్కల సంభాషణలు పూర్తిగావిని, తరువాత పిల్లి తాలూకు చెయిదాల్ని పూర్తిగా గమనించిన ఒక బల్లి రామ, రామా! యెంత ఘోరంచేస్తున్నది యీ పిల్లి అని అంటూ గోడమీద వున్న పురుగును నోట్లో వేసుకుంది రుచి చూడ్డానికి.

అందుచేతే మనపెద్దలు చెప్పుట సులభం; చేయుట కష్టంఅని అన్నారు. చేతకాని చొల్లుకబుర్లు ఎప్పుడూ చెప్పకూడదు. ★

# కొండవీటి కత్తుల బావి

రచన:

**కోటంరాజు సావిత్రి**

బాలలూ! మీ రెప్పుడైన వెన్నెల్లో పడుకుని మీ తాతయ్యను కథ చెప్పమంటారనుకోండి. మీ తాతయ్య మీకు విసుగు పుట్టేటట్లు పెద్దకథ చెప్తుంటాడనుకోండి. మీరు విసుగుతో "ఏమిటి! తాతయ్యా! కొండవీటి చేంతాడులాగ వుందేం కథ?" అంటారు. కొండవీడును గూర్చి మీకు తెలిసినా, తెలియకపోయినా సామెతను ఉపయోగించటం సహజం. మరి ఆ కొండ వీడేమిటో? ఎక్కడుందో తెలుసా?

గుంటూరు జిల్లాలోని ఫిరంగిపురం అనే గ్రామానికి మూడు నాల్గు మైళ్లదూరంలో శిథిలమైన ప్రస్తుతం ఒక చిన్న పల్లెటూరుగా వున్న కొండవీడు ఒకానొక కాలంలో ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మికి ఆభరణంగా వుండేది. మన ఆంధ్ర కవులలో సుప్రసిద్ధుడైన శ్రీనాథకవి సార్వభౌముడుకూడ కొంతకాలం అక్కడ నివసించాడు. ఎందరెందరో మహాప్రభువులైన రెడ్లు కొండవీటి సామ్రాజ్యాన్ని పరిపాలించారు. చుట్టూ లోతైన కందకంతోనూ, ఉన్నతమైన ప్రాకారాలతోనూ, మేఘమండలాన్ని తాకే మేడలతోనూ కొండవీటి దుర్గం శత్రువులకు దుర్గమముగా వుండేది.

ఇప్పటికీ అనేక శిథిలాలు ఆ ప్రదేశంలో కనబడుతై. కూలిపోయిన కోటబురుజులూ, గజశాలలూ, దేవాలయాలు, ముక్కలు ముగాలు చెక్కబడ్డ అనేక విగ్రహాలు ఆ ప్రదేశంలో దొర్లాడుతున్నై. వాటినిచూస్తే మనకెంతో దుఃఖమొస్తుంది. మాటలురాని పసిపిల్లవాని లాగా అవి తామనుభవించిన పూర్వ అత్యున్నత వైభవాన్నిగూర్చి, ప్రస్తుత మనుభవిస్తున్న దుర్దశను గూర్చి చెప్తున్నట్లుగా వుంటుంది. కొండలమధ్య లోతైన ఒక సరస్సువుంది. అందులో పూర్వం రాజులు, రాణులు స్నానాలు చేసేవారట. ఇప్పుడు ఆ చెరువంతా పచ్చని పాచితో భయంకరంగా కన్పిస్తుంది. రెడ్డిరాజులు ధనము దాచుకున్న నేలమాళిగలు మహమ్మదీయ సమ్మెట దెబ్బలకు నోరు తెరచుకుని సర్వస్వాన్ని కోల్పోయినై.

పర్వతాలకు దిగువన ఒక పాడుపడ్డ ఆలయమూ గర్భగుడిలో ఇటీవల పూడ్చివేయబడ్డ పెద్దలోతైన గుంటవుంది. గర్భగుడిలో దేవుని బదులు గుంట ఎలావుందని ఆశ్చర్యపడుతున్నావా?

అది నిజంగా గుంటకాదు కత్తుల బావి. దానివల్లనే కొండవీటి ఆంధ్ర సామ్రాజ్యం అస్తమించింది.

ఎంత మందో మహారాజులూ, ఎందరో నవాబులూ, కొండవీడు జయించాలని ప్రయత్నించారు. ఊహు! ఆదుర్గం స్వాధీనమైతేనేనా! శ్రీకృష్ణ దేవరాయలు కూడా ఆదుర్గాన్ని పట్టుకోలేక పోయాడు. నాల్గు ప్రక్కలపెట్టని గోడలవలెనిలచిన పర్వతపంక్తితో అరివీర భయంకరమైన దుర్గం చిటికెలో మహమ్మదీయ మారణహోమానికి గురయిందంటే మీ కాశ్చర్యంగా లేదూ? దానికి అక్కడివాళ్లొక కథ చెప్తారు, ఏమిటంటే

పూర్వం కొండవీటి కొండలలో

ముట్టిన వస్తువునల్లా బంగారంగా మార్చే "పరుసవేది" అనే మూలిక వుండేదట. అది ఒక బ్రాహ్మణునికి దొరికిందట. దానితో అతను ఎంతో ఐశ్వర్యవంతుడై రెడ్డిరాజులకు కూడా అప్పులివ్వగల స్థితిమంతు డైనాడట.

ఈరహస్యం తెలుసుకున్న రెడ్డిరాజులు ఆమూలికను తమ కివ్వమని బ్రాహ్మణుని కోరారట. బ్రాహ్మణుడు అందుకు నిరాకరించాడు. రెడ్డిరాజులకు కోపం వచ్చింది. ఎలాగైనా ఆమూలికను స్వాధీన పరచు కోవటమో లేక నాశనం చేయటమో జరుపాలని ప్రభువులు నిర్ణయించుకొని సమయంకోసం ఎదురు చూస్తున్నారు.

కొంత కాలానికి బ్రాహ్మణుడు పూరికి వెళ్తూ మూలికను ఇంట్లో వదలి వెళ్లాడు. ఆసమయం కనిపెట్టి రెడ్డిరాజులు అర్ధరాత్రివేళ అతని ఇంటికి నిప్పంటించారు. తనఇల్లు తగలడిపోతున్నదన్న విషయం పొరుగూరిలో వున్న బ్రాహ్మణునకు తెలిసి పరుగెత్తు కుంటూ ఇంటికి వచ్చాడు. అప్పటికే మూలిక తగలబడి పోయిందన్న సంగతి బ్రాహ్మణునకు తెలిసింది. తనఇల్లు తగలబడటానికి కారణం తెలిసికొన్న బ్రాహ్మణుడు రెడ్డిరాజులపై పగతీర్చుకోమని కుమారులకు చెప్పి మంటలలో దూకి మరణించాడట.

తమ తండ్రిచావుకు కారకులైన రెడ్లమీద పగతీర్చుకోవాలనీ, తమ తండ్రికిచేసిన వాగ్దానం చెల్లించుకోవాలనీ బ్రాహ్మణ కుమారులువేచి వున్న సమయంలో కొండవీటి శత్రువులకు ఈసంగతి తెలిసింది. వారంతా బ్రాహ్మణులను ప్రోత్సహించారు.

కొండ దిగువన బ్రాహ్మణ కుమారులు పెద్ద దేవాలయాన్ని నిర్మించటం మొదలెట్టారు. వివిధ దేశాలనుండి శిల్పులను పిలిపించి అత్యద్భుతంగా దేవాలయం నిర్మిస్తున్నారు. గర్భగుడి మాత్రం కన్ను పొడుచుకున్నా కన్పించనంత చీకటిగా తయారు చేయించి, ఆ ప్రాంతమంతా లోతైన బావి త్రవ్వించారు. బావిలో అంచు చుట్టూ అట్టడుగు వరకూ, పదునైన కత్తులు బిగించారు. ఒకటి రెండు సంవత్సరాలలో దేవాలయ నిర్మాణం పూర్తయింది.

ఒక శుభ ముహూర్తాన దేవదర్శనానికి రమ్మనమని రెడ్డిరాజుల నందర్నీ ఆహ్వానించారు. అంత ఎక్కువకాలం అంతమంది సుప్రసిద్ధ శిల్పులచే నిర్మింపబడిన ఆదేవాలయం ఎంత రమణీయమో చూడవలెననే కుతూహలంతో రెడ్డిరాజులంతా వేంచేశారు. కానీ బ్రాహ్మణుడు దేవదర్శనానికి ఒక షరతు ఏర్పరచాడు. అదేమిటంటే హాల్లోగుండా గర్భగుడిలోకి దేవదర్శనానికి వెళ్లినవారు దొడ్డివాకిలిగుండా బయటకు వెళ్లాలని. అందుకు అంతా సమ్మతించారు. ఒక్కొక్క రే హాల్లోనుండి గర్భగుడిలో ప్రవేశించటం కత్తులబావిలో పడటం, పడ్డమనిషిని బావిలోని కత్తులు ముక్కలు ముక్కలుగా నరికి వేయటం. ప్రతివారూ తమకంటె ముందు వెళ్ళినవారు తమకంటె ముందు వెళ్లారని తలచేవారు. మొత్తంమీద అందరూ ఆ బ్రాహ్మణుని పగకు ఆహుతయ్యారు. ఈ మారణహోమం పూర్తయిందని తెలియగానే దుర్గంచుట్టూ పొంచి వున్న మహమ్మదీయ సైన్యాలు దుర్గాన్ని స్వాధీన పరచుకొన్నై. రాజద్రోహియైన బ్రాహ్మణులను మహమ్మదీయులే పొడిచి వేశారు.

ప్రస్తుతం ఆదేవాలయం ముందు భాగం మహమ్మదీయ మసీదుగా నిలబడివుంది.

చూచావా బాలా! అంతః కలహాలవల్ల ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మి ఎలాఅస్తమించిందో? అందుకనే అలాటి కలహాలు దేశారిష్టాలు.



# అభిమానం

రచన:

**జానకి**

పూర్వం మిథిలాపురం రాజధానిగా విదర్భదేశాన్ని ఏలినరాజు జనకమహారాజు. ఆయన మహామేధావి, తర్కశాస్త్రజ్ఞుడు, వేదాంతపరుడు అని పేరు పొందాడు. ఆయనేకాక ఆయన రాజ్యంలోని ప్రజలంతా అమోఘ వాక్ప్రౌఢిమ కలిగినవారిగా కీర్తిగాంచారు. నారదుడు ఈ జనకుని గొప్పతనమేమిటో చూదామని ఒకనాడు బయలుదేరాడు. దేవతలంతా జనకుని వాక్చాతుర్యాన్ని విజ్ఞానాన్ని, పొగుడుతున్నారు. వీరి ప్రశంసల్లోని సత్యమెంతవరకో, తెలుసుకుందామనే కుతూహలం కలిగిందాయనకు. నారదుడు మిథిలానగరాన్ని చేరుకున్నాడు.

ఎండ మాడ్చేస్తుండటంవలన ఊళ్లోకి వెళ్లే ఓపికలేక నారదుడు ఊరివెలుపలి యేటిఒడ్డున విశ్రమించాడు. తలగడలేనిదే నిద్రపట్టని కారణాన తన యెడమచెయ్యి తల క్రింద పెట్టుకుని పడుకున్నాడు.

ఇంతలోనే ఊళ్లోని స్త్రీలు రేవుకి నీళ్లకై వచ్చారు. వారిలో యిద్దరు స్త్రీలు నారదుని సమీపాన సంభాషిస్తుండటంవలన వారి మాటలు ఆయనకు స్పష్టంగా వినిపించసాగాయి. ఒకామె, "అక్కా, ఈ ప్రక్కన పడుకున్నాయన్ని చూస్తే మహర్షిలాగ ఉన్నాడు. తలగడలేనిదే నిద్రపట్టని ఈయన తపస్సేమి చేస్తాడే?" అన్నది. రెండో స్త్రీ, "నీ వెఱ్ఱిగానీ, తపస్సు చేసినంతమాత్రాన దేహాభిమానం పోతుందిటే? దేహంమీద ఎంత అభిమానం లేకపోతే ఈయన తల క్రింద పెట్టక, చేతిమీద పెట్టుకున్నాడంటావు?" అని నవ్వుకుంటూ ఇద్దరూ వెళ్లిపోయినారు.

ఈ సంభాషణ విన్న నారదుడు తనపనికి తానే సిగ్గుపడి తలక్రింద చెయ్యి తీసివేశాడు. కాస్సేపాగిన తరువాత ఆయిద్దరు వనితలే మళ్లీ నీళ్లకోసరం వచ్చారు. ఏం మాట్లాడుకుంటారోనని నారదుడు చెవులు నిక్కబొడుచుకుని వినమొదలుపెట్టాడు. వారిలో ఒకామె నవ్వుతూ, "చూశావుటే చెల్లీ, ఈ మునీశ్వరుడు మన మాటలు విన్నాడల్లే ఉన్నది. తల క్రింద చెయ్యి తీసివేశాడు." అన్నది రెండోఆమె ఆశ్చర్యాన్ని నటిస్తూ "ఔనేఅక్కా. ఈయనకు దేహాభిమానమే ఉన్నదనుకున్నాము. ఆత్మాభిమానంకూడ ఉన్నదే. లేకపోతే మనం నవ్వుకుంటూ అన్న మాటలకి సిగ్గుపడి తన సౌఖ్యాన్ని వదులుకుంటాడా?" అన్నది.

ఈమాటలన్నీ విన్న నారదుడు వీరి బుద్ధికుశలతకు ఆశ్చర్య పోయాడు. 'యథారాజా తథా ప్రజా' అన్న లోకోక్తిని సార్థకం చేశారు వీళ్లు. ఈ రాజ్యంలోని స్త్రీలు గొప్ప విదుషీమణులు. ఇక జనకమహారాజునీ, ఆయన ఆస్థాన విద్వాంసుల్నీ చూడబోవటం తెలివితక్కువ. వారిని పరీక్ష చేయబూని ఇంకెన్ని పరాభవాలు జరిపించుకోవాలోనని భయపడి నారదుడు విష్ణులోకానికి మరలాడు.

★

# "వదులుకున్న హక్కులు"



దేశమంతా ధూమ శకటాలు పరుగెత్తని రోజుల్లో దాక్షిణాత్యులు కాశీకి వెళ్ళి రావడమంటే దాదాపు సంవత్సరం పట్టేది. అసలు కాశీకి వెళ్ళినవాళ్ళు సజీవంగా యింటికొస్తారనే నమ్మకం కూడా ఆరోజుల్లో తక్కువే. అందుచేతనే కాశీకి వెళ్ళి క్షేమంగా తిరిగి వచ్చినవాళ్ళని మేళ తాళాలతో యింటిదాకా తీసుకొచ్చేవారు. కాశీ విశ్వేశ్వరుణ్ణి విశాలాక్షిని చూచి, గంగలో మునిగి వచ్చిన వాళ్ళకంటే ధన్యులీ భారత భూమిలో వున్నారా అనే విశ్వాసం ఆకాలంలో వుండేది.

ఇలాంటి సత్యకాలంలో కోటి లింగం కాశీకి ప్రయాణం కట్టాడు. అతడొక బ్రహ్మచారి. ఎక్కడికి వెళ్ళినప్పటికి ఎలాంటి చీకు చింత లేకుండా స్వేచ్ఛగా తిరిగివస్తూండే వాడు. చిన్నతనంలోనే అబ్బ అమ్మ ఆజ్ఞ లేకుండా బొంబాయిదాకా వుడాయించి ఓవడాదిపాటు అక్కడ ఇక్కడ తిరిగి మళ్ళీ గృహప్రవేశం చేశాడు. అతడు బొంబాయిలోనే చూశాడు మొదటిసారిగా ధూమ శకట ప్రథమావతారాన్ని. ఏడాది పాటు బొంబాయిలో వుండటం చేత నాలుగు హిందూస్థానీ ముక్కలు నేర్చుకున్నాడు.

మరొకసారి రామేశ్వరం దాకా వెళ్ళి రావడంచేత కోటిలింగానికి అరవంకూడా కాస్త పట్టుబడింది. ఇలాంటి సర్వభాషాకోవిదుడు, సకలదేశ ద్రిమ్మరి, సద్బ్రహ్మచారి కాశీకి వెళ్తుంటే వూరికే వెళ్ళనిస్తారా? ఆ వూళ్ళో కొందరు కోమట్లు, బ్రాహ్మణ వితంతువులు, ముసలివాళ్ళు-ఎందుకూ స్త్రీ పురుష జాతులు కలసి ఓ యిరవై మంది కోటి లింగం వెంటబడ్డారు.

---

రచన:

## శ్రీ సిద్ధాంతి మల్లికార్జునం

---

అయితే కోటిలింగం ఒక షరతు మీద వాళ్ళందర్ని గంగలో ముంచుకొస్తానన్నాడు. వాళ్ళందరు అతని మాట కడ్డుచెప్పకుండా, అతన్ని అనుసరిస్తూ అతనికయ్యే ఖర్చులన్నీ భరించేపక్షంలో యీ భారమంతా వహిస్తానన్నాడు. అసలు నాలుగు విషయాలు తెలిసినతోడు దొరకాలేగాని యీ షరతులేమిటి? నలుగురు నాలుగు రూపాయలేసుకుంటే ఆ బ్రాహ్మడి ఖర్చులన్నీ గడిచిపోతాయని, యాత్రికులందరు కోటిలింగం షరతుల కొప్పుకొని ఒక సుముహూర్తాన బైలు దేరారు.

ఎంతైనా ఆరోజుల్లో యిలాంటి దూర ప్రయాణాలు కష్టసాధ్యమైనవే. పాపం. ప్రయాణీకుల సౌకర్యార్థం దార్లన్నిటినీ దొంగలు కాపలా కాస్తూండేవారు. కొరవ నరవ కొండలమధ్య, అడవులమధ్య వుండే దార్లను నక్కదగ్గరనుంచి పెద్దపులిదాకా కాపలాకాస్తూండేవి వీటన్నికీతోడు దారిలో వివిధ దేశాలు, భోజనాలు, భాషలు, ఈ ప్రమాదాలన్నీ దాటుకొని చెక్కు చెదరకుండా కాశీకి చేరడం గొప్పకార్యమే. ఎలాగైతే నేం, యీ అడ్డంకులన్నీ దేవుడి ధర్మాన తప్పుకుంటూ మన యాత్రికులందరు గబగబ కాశీని సమీపిస్తున్నారు. దారిలో కొందరు అరవ సోదర సోదరీమణులు కూడా కోటి లింగం పాలబడ్డారు. దాదాపు అరవంద యాత్రికులతో మహావైభవోపేతంగా కోటిలింగం కాశీదరి దాపుల్లోకి నడుస్తూన్నాడు.

కాశీకి, నలభై మైళ్ళ దూరంలోనే అప్పట్లో రైలుమార్గం వేశారు. కొందరు రైల్లోనే కాశీ వెళ్ళడం

ప్రారంభించారు. కోటిలింగం యిదివరలో రైలు చూడటంచేత తన అనుచరుల మాదిరి బెదురుకోక అందర్నీ రైలెక్కమన్నాడు. ఇష్టం లేకపోయినా అందరు కోటిలింగం ఆజ్ఞ పరిపాలించారు...... కాని రైలు ప్రయాణం చాలా వింతగా నేవుంది వారికి.

రైలో కూర్చున్నారో లేదో. నలుగు రైదుగురు పండాలు యీ గుంపును చుట్టుముట్టేశారు. ఎవడి గోల వాడిదే. వాళ్ల భాషలో మాట్లాడుతుంటే యీ ఆంధ్ర తమిళ సభ్యులకేం తెలుస్తుంది...... వీళ్లపోరు పడలేక ఆ నలుగుర్ని కోటిలింగంమీదికి ప్రయోగించారు యాత్రికులు.

సరే బెల్లంమీదికి ఈగల్లాగా యీ నలుగురుపండాలు బెంచీల మధ్యగుండా పడుతూ లేస్తూ వెళ్ళి కోటిలింగంమీద వాలారు. ఒక పండా అయితే తిన్నగావెళ్ళి కోటిలింగం వళ్లోనేకూర్చొని కౌగలించుకున్నంతపని చేశాడు. అలా కూర్చున్నవాడు కూర్చోకుండా కోటిలింగం గడ్డం పట్టుకొని, మహారాజ్, మహారాజ్, అంటూ తన ప్రవరంతా చెప్పకో సాగాడు. తక్కిన ముగ్గురు వాడికంటె ఎక్కువ స్వరంలోనే కోటిలింగం మూతిలో మూతిపెట్టి తమ పంచాంగం విప్ప సాగారు. రైలుపెట్టంతా ఒకటే గోల. అందరు కోటిలింగాన్ని చూచి నవ్వేవాళ్లే

వాళ్ల గోలకు కోటిలింగానికి జ్వరం తలనొప్పి వళ్లునొప్పులు చెవిపోటు అన్నీ ఒకేసారి వచ్చినట్లైంది. లేచి నిలబడ్డాడు. మొదటి పండా అతనిచేతులు కాళ్లు అన్ని తాకి బ్రతిమాలుకో సాగాడు. అతని అమాయకత్వానికి, నీచత్వానికి అతనిమీద కోటిలింగానికి జాలికలిగింది. కాస్త అతనివైపుకే మొగ్గాడు ఇది చూచి తతిమా ముగ్గురి గుండెల్లో బండలుపడి మొదటివాణ్ణి తిట్టుకుంటూ పక్క స్టేషన్లోదిగి మరొక పెట్టిమీదికి దండయాత్ర చేశారు.

కాశీ స్టేషనులో బండి ఆగడంతోటే పండా గబగబ బండిదిగి కూలీలచేత యీ గుంపును వాళ్ల సామానులను అవతలకి తెప్పించాడు. ఒక్కక్షణంలో బండ్లు మాట్లాడి వాళ్లవాళ్ల సామానులతోకూడా తనబసకు చేర్చేశాడు. ఇంత సమూహాన్ని చూసి పెద్ద పండా అతని భార్యా బిడ్డలు ఎంత సంతోషించారో వర్ణనాతీతం. వీళ్లవల్ల సంవత్సరానికి సరిపొయ్యే లాభం సంపాయించవచ్చని అందరు సంతోషంలో మునిగి పోయారు. రైల్లో యీ యాత్రికులకోసం తా కొంతగా పోట్లాడినదీ, పెద్దపండాతో చిన్న పండా విన్నవించుకున్నాడు. కోటిలింగాన్ని ఆపాదమస్తకం పొగిడి విరిగివేసారి పొయ్యాడు. తనక్రింద బతికే పండాలలో యింతటి శూరు డున్నందుకు పెద్ద పండా చాలా గర్వపడ్డాడు. పైగా కోటిలింగాన్ని, అతని గుంపులో వాళ్లనిచూస్తే ఒక్కరుకూడా సాధారణమైనవాళ్లుగా తోచలే దతనికి.

(34-వ పేజీ చూడండి)






"ట్రెజర్ ఐలెండు" (కాంచనద్వీపం) నవల 1881 లో ఒక పిల్లలపత్రికలో సీరియల్‌గా ప్రకటింపబడినప్పుడు గ్రంథకర్త స్టీవెన్సన్ (1850-1894) గాని, ఇతరులు గాని అది ప్రపంచప్రఖ్యాతి పొందుతుందని ఊహించలేదు. రెండేళ్లతర్వాత అది పుస్తక రూపంలో వెలువడింది. వెంటనే కాపీలకోసం లండన్ నగరమంతటా వేట ప్రారంభమైంది. అప్పటినుండీ ఈ నవలకు పాఠకుల సంఖ్య ఏటేట అభివృద్ధి అవుతూనే ఉంది.

"టామ్‌సాయర్" నవల మీలో పలువురు చదివే ఉంటారు. సముద్రపు దొంగల్లో చేరాలని, ఎక్కడో దూరసముద్రాల్లో గుప్తధనంకోసం వెదకాలనీ టామ్ కలలు కంటాడు. ఆ కలల నన్నిటినీ "కాంచనద్వీపం" కథానాయకుడైన జిమ్‌హాకిన్స్ అనే బాలుడు నిజం చేసుకుంటాడు. సాహసోపేతమైన సముద్రయానం, సముద్రపు దొంగలకుట్రలు, అడవుల్లో గోరిల్లా యుద్ధాలు, మొదలైన సంఘటనలతో ఈ నవల తుదివరకూ చదవందే మనసు నిలవనివ్వదు. పిన్నలకు, పెద్దలకు, ముఖ్యంగా పిల్లలకు ఈకొత్తసీరియల్ సమాదరణీయం అవుతుందని ఆశిస్తున్నాము.

వాల్ట్‌డిస్నీ తయారుచేసిన "ట్రెజర్ ఐలెండు" చిత్రంతాలూకు బొమ్మలు ఈ సీరియల్‌లో ఆయా సందర్భాలలో ప్రకటింపబడతాయి. ఆబొమ్మలను ప్రకటించుట కనుమతించిన వాల్ట్‌డిస్నీ ప్రొడక్షన్సువారికి, ఆర్. కె. ఓ. రేడియోవారికి మా కృతజ్ఞత.

**వీా కాపీ నేడే రిజర్వు చేసుకోండి**

## "వదులుకున్న హక్కులు"

(32-వ పేజీ తరువాయి)

అందరు లక్షాధికారులే ననుకున్నాడు. ఇంతమంది లక్షాధికారులకు నాయకుడైన కోటిలింగం ఎంతటివాడోనని పెద్దపండా చాలా ఆశ్చర్యపడ్డాడు.

కోటిలింగం శుద్ధ శ్రోత్రియుడులాగా కనిపిస్తాడు. స్ఫురద్రూపి. ఎర్రగా నిగనిగలాడుతూంటాడు. వయస్సు35 ఏళ్లుంటాయి. పిలక, చెవులకు కుండలాలు, వెండి తీగతో చుట్టిన రుద్రాక్షమాలలు, వ్రేలికి మంచి ఉంగరం, బొడ్లో వెండి నశ్యపుడబ్బా, సేలంఅంచు పైపంచ, ధోవతి, వెండిపొన్ను వేసిన చేతికర్ర— ఈవేషం కోటిలింగాన్ని గురించి చాలా విశేషాంశాలను తెలియచేస్తూంది. ఇతన్నిమాత్రం చాలా జాగ్రతగా గమనించమని పెద్దపండా తన శిష్యగణాలకు రహస్యంగా హెచ్చరించాడు.

అల్లుడివెంబడి గిల్లు డన్నట్లుగా, కోటిలింగంవల్ల అతని అనుచరులకందరికీ మంచిమర్యాద జరుగుతూంది. భోజనాది వసతులు అద్భుతంగా వున్నాయి. పండాల సహాయంతో కాశీలో చూడవలసిన వింతలు విశేషాలు పుణ్యస్థలాలు ఒక్కటికూడా తప్పకుండా చూచి, ఆనందాబ్ధిలో ఓలలాడుతున్నారు అందరు.

"నిజానికి పండాలు ఎంత సేవాపరులు! అంతటి దూరదేశాలనుంచి వచ్చిన యాత్రికులకెన్ని సౌకర్యాలు కల్పించి వాళ్లచేత అన్ని కార్యకలాపాలు చేయిస్తున్నారు. ఒకవేళ ఫలాపేక్షతోనే చేస్తున్నారనుకోండి...అయినా వాళ్లది నిజమైనసేవ. ఇలా భావించాడు కోటిలింగం ఒకనాడు. కోటిలింగానికి జరిగే మర్యాదలలో ఏమాత్రం లోపంకనుపించడంలేదు.

ఒకనాడు పెద్దపండా, చిన్నపండా, కోటిలింగం, ఒకగదిలో కూర్చొని మాట్లాడుకోవడం ప్రారంభించారు. భోజనాలైనందుచేత తమలపాకులు నములుతూ చాలా 'ఖుషీగా' వున్నారందరు. కోటిలింగం మంచంపై పరుపుమీద పడుకున్నాడు. పండాలిద్దరు, నేలమీద చాపలపై కూర్చున్నారు.

"విశ్వనాథ్ పండిత్ జీ!...నిజంగా మీరు ఎంత పుణ్యాత్ములయ్యా" అన్నాడు కోటిలింగం.

"ఏం, మహారాజ్" అన్నాడు పెద్దపండా. కొంచెం మందహాసంతో.

"ఎప్పుడూ యీ విశ్వేశ్వరుడి సమక్షంలో వుంటూ, గంగలో ప్రతిరోజూ స్నానంచేస్తూ మాబోటివాళ్లకిలాంటి సౌకర్యాలు కల్పిస్తూ ఎంతసేవ చేస్తున్నారు!! మీకెంత పుణ్యం!" అన్నాడు కోటిలింగం కొంచెం కవిత్వ ధోరణిలో పడుతూ.

"అచ్ఛా. మహారాజ్...ఎవరైనా తమబోటివారే మమ్మల్ని కాస్త కనిపెడుతూంటారు. లేకపోతే మాకేముంది? ఏదో మీరెవరైనా మాకేమైనా యిస్తే మీ పేరు చెప్పుకొని బతుకుతూంటాం." అన్నాడు విశ్వనాథ్. ఇంతలో చిన్నపండా అందుకున్నాడు.

"మహారాజ్. తమరు నిజంగా చాలా గొప్పవాళ్లు. మా కష్టాన్ని తెలుసుకొన్నారు......గొప్పమనసు చేసుకొని మమ్మల్ని కనిపెట్టాలి." అంటూ నమస్కారం చేశాడు.

కోటిలింగానికి వాళ్లమీద చాలా జాలికలిగింది.

"విశ్వనాథ్ జీ...ఎందుకో గాని మీరంటే నాకు చాలా భక్తి గౌరవాలు ఏర్పడ్డాయి. నేను మా దేశానికి, వెళ్ళి కాశీకి వెళ్లేవాళ్లందర్నీ మీదగ్గరికే వెళ్లమని చెప్తాను." అన్నాడు.

"అచ్ఛా మహారాజ్. తమరు చాలా మంచివారు...మీరిక్కడికి వచ్చినందుకేదో ఒక మంచిపనిచేస్తే తమపేరు శాశ్వతంగా వుంటుంది...ఎప్పుడూ దానధర్మాలు చేసేవారు......మాకు ఏదైనా దానంచేస్తే తమపేరు చెప్పుకొని బతుకుతాం" అన్నాడు పెద్దపండా, విశ్వనాథ్ జీ.

కోటిలింగం వాళ్ల మాటలన్నీ సావకాశంగా విని "విశ్వనాథ్ జీ... నేను యిక్కడించి వెళ్లేలోపల ఏదో ఒకటి చేస్తాలే" అంటూ నిద్రపట్టించాడు.

ఆక్షణం మొదలుకొని కోటిలింగానికి మర్యాదలెక్కువైనాయి. అతనిగ్గాను ఒక ప్రత్యేకమైన గదిచ్చారు. ఇద్దరో, ముగ్గురో జవానులెప్పుడూ అతని దగ్గరుండేవారు. ఇప్పుడు కోటిలింగానికి ప్రత్యేకమైన భోజనం. అతణ్ణి కాలు భూమిమీద మోప నివ్వడంలేదు. ఇల్లు కదిలితే కోటిలింగం టాంగాలో వెళ్లవలసిందే. ఎప్పుడూ అతని వెంబడి

రక్షకదళం, ఒకటుండేది. ఇలా ఒక నెల రోజులు యాత్రికులు కాశీలో కాలం గడిపారు.

రేపో ఎల్లుండో యీ జట్టు కదిలిపోతుందనగా విశ్వనాథ్‌జీ కోటిలింగానికి జ్ఞాపకంచేశాడు దానం సంగతి. కోటిలింగం సరే నన్నాడు. వెంటనే ఒక గదిలో పండాలు, కోటిలింగం, దాన విక్రయాది పత్రాలురాసే వ్యక్తి హాజరైనారు. కోటిలింగం తనకువచ్చిన హిందీలో సంగతంతా చెప్పాడు. ఆ ప్రకారం పత్రం తయారైంది. దానిమీద కోటిలింగం సంతకం చేశాడు తెలుగులో. సాక్షులు కూడా సంతకాలు చేశారు. పత్రం సిద్ధమైంది. పత్రంలో వ్రాసిన విషయం యిది.

"మద్రాసు రాష్ట్రంలో, నెల్లూరుజిల్లా, కావలి తాలూకా, ఫలానా గ్రామంలో నాకుగల సర్వహక్కులు, కాశీపురనివాసులున్న, సుప్రసిద్ధ పండాలును, అయిన శ్రీవిశ్వనాథ్ పండిత్‌జీ గారికి దానంచేస్తున్నాను."

వ్రాతలు ఆతదనంతరం జరగవలసిన మర్యాదలు, అన్ని సక్రమంగా జరిగాయి. తన హక్కును వ్రాతపూర్వకంగానే కాకుండా, మంత్రపూర్వకంగాకూడా బలపరచుకునే నిమిత్తం, విశ్వనాథ్‌జీ కోటిలింగంచేత గంగానదిలో నీళ్లుగూడా వదిలించాడు.

ఇక అక్కడనుంచి కోటిలింగాన్ని ఒక్కటేసారి ఆకాశాని కెత్తారు పండాలందరు. కాశీలోని పండాల సంఘంలో కోటిలింగం పేరు మ్రోగిపోతూంది. అతని ధర్మబుద్ధిని వేనోళ్ల పొగడని వ్యక్తిలేనే లేడు. పండాలందరికి విశ్వనాథ్‌జీ అదృష్టాన్ని చూడగానే కళ్లు కుట్టాయి. అతడు ఒఠ్ఠి మోసకారని చాలామంది అతన్ని దూషించారు.

కోటిలింగం, దానంచేసిన కొద్ది రోజుల్లోనే తనజట్టును కదిలించుకొని ప్రయాగ, గయ, హరిద్వార్ మొదలైన క్షేత్రాలన్నీ రైలుమీద కాలినడకలమీద బండ్లమీద వెళ్ళి దర్శించి, యీడాదిమీద, రెండుమూడు మాసాలు గడిచాక వూరు చేరుకున్నాడు.

ఈ యాత్రలో ఏమీ కష్టాలు కలగలేదు. ఆఖరుకు యివ్వాళో, రేపోఅనే పండుముసలివాళ్లు కూడా క్షేమంగా తిరిగి వచ్చారు. ఇక వాళ్లందర్ని మేళతాళాలతో వూరేగించి,ఎన్నెన్నో వేడుకలు చేశారు. వాళ్ల నోళ్లగుండానే యాత్రలోని వింతలు విశేషాలు, విధి విరామం లేకుండ విన్నారు. కాశీలో ఎవరెవరు ఏమేమి వదిలిందికూడా వూరంతా క్షణంలో వెల్లడైంది. వాళ్లను చూచాక కొందరికి కాశీ మీదికి గాలి మళ్ళింది. అందరు కోటిలింగాన్ని పొగడటంచేత మళ్ళీ అతన్నే తోడుతీసుకెళ్లాలని కొందరు నిశ్చయించుకున్నారు.

కోటిలింగం తనకు తెలిసినవన్నీ చెప్పాడేకాని తాను కాశీలో వదులుకున్న హక్కుల విషయం మాత్రం ఎవ్వరికీ చెప్పలేదు. నిజానికి కాశీలోకూడా రెండో మనిషికి తెలీకుండా జరిగిందీ దానం.

అయిదారు మాసాలు జరిగాయి. విశ్వనాథ్ పండిత్‌జీ, యీ అయిదారు మాసాలనుంచి కోటిలింగం హక్కులను స్వాధీనపరచుకోడానికి ఎన్నిమార్లో ప్రయత్నించాడు. కాని ఒక్కసారైనా ప్రయాణం ముడిపడ్లేదు. చిట్టచివరకు తన శిష్యుల్లో ప్రధాన శిష్యుణ్ణి ఆ వూరు పంపడానికి నిశ్చయించుకున్నాడు. ఆ శిష్యుడు కూడా యీ ప్రయాణానికి కష్టపడ్డాడు. ఆ వూళ్ళో కోటి

లింగాని కింకా ఏమైనా హక్కులు మిగిలుంటే, ఆయనకాళ్లు పట్టుకొని ఆశాస్తా తనపేరిట వ్రాయించుకుందామని యీ శిష్యుడికి నోరూరుంది.

దారిలో నానాతంటాలు పడి, తిన్నగా యీ శిష్యుడు ఆ వూరు చేరుకున్నాడు. ఈశిష్యుడికి, కోటిలింగానికి మొట్టమొదట ధూమశకటంలో పరిచయం కలిగింది. అందుచేత కోటిలింగాన్నితనికి బాగా తెలుసు. ఆ వూరిలో కోటిలింగంకొరకు విచారిస్తే 'ఆయన యింటిదాకా వచ్చి యీ శిష్యుడికి దారి చూపించారు ఎవరో ఒక పుణ్యాత్ముడు.

అది సాయంకాలం. చీకట్లు కమ్ముకుంటూన్నాయి. కోటిలింగం యింటిముందు పంచలో సంధ్యావందనం చేసుకుంటున్నాడు తదేకదీక్షతో. విశ్వనాథ్‌జీ శిష్యుణ్ణి చూడటంతోటే కోటిలింగానికి ఆశ్చర్యసంభ్రమాలు ఏకముహూర్తాన కలిగాయి. మందహాసం చేస్తూ తత్క్షణం సంధ్యకు స్వస్తి చెప్పి, లేచి శిష్యుణ్ణి వినయపూర్వకంగా చేతులు పట్టుకొని యింట్లోకి తీసుకోపొయ్యాడు.

"ఏం, మహారాజ్. క్షేమమేనా?" అన్నాడు శిష్యుడు.

"ఆఁ...మీ విశ్వనాథ్‌జీ బాగున్నారా?"

"బాగున్నారు...... ఇంట్లో ఆడవాళ్లెవ్వరూ లేరా?"

"లేరు...మొన్ననే వూరికి వెళ్లారు...నేనే వంట చేసుకుంటున్నా."

"పాపం." అన్నాడు శిష్యుడు అప్రయత్నంగా.

"ఏం యింతదూరం వచ్చారు?"

"ఏముంది మహారాజ్. తమరు చేశారుగా దానం."

"ఓహో, అదా సరే, సరే..."

"అదే. అదే. ఆ హక్కులన్నీ వశపరుచుకు రమ్మని విశ్వనాథ్‌జీ పంపాడు నన్ను."

"మంచిది...సరే. రేపు దాని విషయం చూస్తాంలే."

అంటూ కోటిలింగం వంటపొయ్యిదగ్గరకి వెళ్లాడు.

రాత్రి భోజనాలయ్యాక, కాశీలోని విశేషాలనుగురించి వీరిద్దరు చాలాసేపు మాట్లాడుకొని. నిద్రపొయ్యాడు. ఆ మాటలసందర్భంలో శిష్యుడు. తన కోర్కెను తెల్పాడు. కోటిలింగం శిష్యుడి కోర్కెకూడా నెరవేర్చడానికి నిశ్చయించుకొని అందు కంగీకరించాడు.

మరునాడుదయాన్నే స్నానానికి తుండుగుడ్డలు, రెండు రాగి చెంబులు తీసుకొని. కోటిలింగం, శిష్యుడు చెరువుకు వెళ్లారు. స్నానానికి పూర్వం రాగిచెంబులు రెండు శుభ్రంగా తోమి, పంచవుతికి చెరువు కట్టమీద ఆరవేశాడు కోటిలింగం. శిష్యుడుకూడా పంచవుతికి ఆరవేసుకున్నాడు. తర్వాత యిద్దరు చెరువులో స్నానంచేసి ఒంటినిండా విభూతిరేఖలు పెట్టుకొని, చెరువుదగ్గరే సంధ్యావందనం ముగించుకొని వూళ్లోకి బైలుదేరారు. రెండు రాగిచెంబులను కోటిలింగం మోసుకెళ్లాడు. ఊళ్లో ప్రవేశించగానే ఒక పెద్దయింటిముందు కోటిలింగం ఆగి శిష్యుడి చేతికి పెద్దరాగి చెంబుయిచ్చి,

"ఇదుగో చూడు. ఈ వూళ్లో యింటింట ప్రతిరోజు ఉపాదానానికి వెళ్ళి, తద్వారా సంపాయించిన బియ్యంతో కాలక్షేపంచెయ్యడమే నాకీ వూరిమీదగల సర్వహక్కులు. ఇప్పుడా హక్కులన్నీ మీ గురువులవారికి నీపరంగా వశంచేస్తున్నాను. ఈక్షణంనుంచి నీవు పని ప్రారంభించవచ్చు."

అని కోటిలింగం చెప్పేసరికి శిష్యుడు నిర్ఘాంతపోయిది అతణ్ణి చూస్తూ నిలబడ్డాడు.

"మరచిపొయ్యా. రాత్రి నీవు కూడా కొరవ సరవ మిగిలివుండే హక్కులు నీకు దానంచెయ్యమని కోరావుగదూ సరే. చూడు. ఈపక్కవూళ్లో నాకు యీ హక్కు తరతరాలనించి వస్తూంది. కాని బ్రహ్మచారి నవడంచేత యీవూరే నాకు ఎక్కువై పోతూంది. ఇదుగో యీ చిన్న రాగిచెంబు తీసుకో. ఆవూళ్లో నీవే నాహక్కులన్నీ వశం చేసుకొని కాలక్షేపంచెయ్యి. నిన్నడిగే మొనగాడీ తాలుకాలో లేనేలేడు అంటూ కోటిలింగం రెండో రాగిచెంబును శిష్యుడు చేతిలో పెట్టాడు.

ఆ శిష్యుడికి పిచ్చెత్తినట్లయింది. ఏమీతోచక చెంబులు రెండు నేలమీదికి అప్రయత్నంగా జారవిడిచి పిచ్చివాడిలాగా కోటిలింగం కళ్లలోకి చూస్తూ శిలావిగ్రహంలాగా నిల్చున్నాడు.



# 2వ వారం ఆంధ్రదేశమంతటా నడుస్తున్నది.




* ఆంధ్ర, దత్తమండలములు : నవయుగ ఫిలింసు, విజయవాడ.

* మైసూరుస్టేట్ : ప్రకాశ్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ.

* నైజాం స్టేట్ : కర్నాటక ఫిలింసు లిమిటెడ్, బెంగుళూరు సిటీ.

వివరములకు: **ప్రకాశ్ ప్రొడక్షన్సు, శాంతోం, మద్రాసు.**

# ★ సృష్టి - అనుకరణ ★

మద్రాసులో ఇటీవల జరిగిన ఆలిండియా సినీటెక్నిషియన్స్ కాన్ఫరెన్సులో మాట్లాడిన వారిలో దేవకీబోసు మొదలుకొని అనేక మంది మళ్లీ మళ్లీ చెప్పిన విషయాలలో ఒకటి మన చిత్ర నిర్మాతలు జాతీయమైన సినిమా కళ సృష్టించుకోవాలని, గుడ్డిగా పాశ్చాత్య సినిమా పద్ధతులను అనుకరించ కూడదనీనూ. ఈ అనుకరణల దౌర్భాగ్యం గురించి అనేక మంది బాధపడుతూ ఉండటమూ, కొద్ది మంది రాయటమూ కూడా జరుగుతూనే ఉన్నది. అయితే ఇతరులు ప్రకటించటం కన్న ఈ భావాన్ని దేవకీబోసు లాటి అనుభవజ్ఞులూ, అనేక దశాబ్దాలపాటు సినిమా రంగంలో కృషి చేసినవారూ అనటంలో కొంత ప్రాముఖ్యం ఉన్నది. టెక్నిషియనుల సమావేశంలో అనటంలో మరింత ప్రాముఖ్యం ఉన్నది.

ఈ అనుకరణకు తల్లి పురుగేమిటో తేల్చుకున్నట్టయితే అది నూటికి తొంభై తొమ్మిది సార్లు చిత్ర నిర్మాతే అవుతూ ఉంటాడు. పాశ్చాత్య అనుకరణ ఒక్క కథ విషయంలోనే కాక, వేషధారణ విషయంలోనూ, ఆచార వ్యవహార విషయంలోనూ, సెటింగుల నిర్మాణంలోనూ, ఆఖరుకు పాటలలోనూ, వినోదాలలోనూ కూడా కనిపిస్తుంది. మన దేశంలో హోటళ్లలో భోజనాల దగ్గిర ఆర్కెస్ట్రాలూ, అక్కడ ఆడవాళ్లువచ్చి పాడి భోక్తలను రంజింపచెయ్యడమూ ఎక్కడైనా ఉందా? ఉన్నట్టు సినిమా చిత్రాలు తీశారు. పులిని చూసి నక్క వాతలు పెట్టుకోవటం మన దేశీయ చిత్రాలలో అనేక వాటిల్లో జరుగుతున్నది. మక్కికి మక్కి హాలీవుడ్ చిత్రాలను కాపీ కొట్టిన చిత్రాలలోనే కాక, కాస్తో కూస్తో స్వతంత్రంగా తీసిన చిత్రాలలో కూడా పాశ్చాత్య అనుకరణలు సంగీతంలోనో, దుస్తులలోనో, సెటింగుల లోనో, సంభాషణలలోనో కనిపిస్తూనే ఉంటున్నాయి.

టెక్నిషియనులకు కల్పనా శక్తి చాలక అనుకరిస్తున్నారనుకోవటానికి ఇన్నిరకాల టెక్నిషియనులూ కల్పనా శక్తి చాలని వారేనా? క్షుద్రమైన, అర్థరహితమైన ఈ అనుకరణకు మూలకారణం చిత్ర నిర్మాతలే ననటానికి సందేహం లేదు. టెక్నిషియనులందరూ గొప్ప కళోపాసకులని ఆకాశానికెత్తకుండానే, సాధారణంగా టెక్నిషియన్ అయిన వాడికి సృష్ట్యానందం కొంత ఉంటుంది స్వతహాగా. ఈ ఆనందాన్ని పొందటానికే టెక్నిషియన్ కృషి తలపెడతాడు. ఆ ప్రయత్నం రెండు కారణాల చేత చెడవచ్చు—స్వతహాగా సృష్టి చేసే శక్తి చాలక అనుకరణకు పాల్పడటమో, స్వంత కల్పనకు ప్రోత్సాహం లేని కారణం చేత డబ్బు కాశపడి అనుకరణకు పూనుకోవటమో. మూడో కారణం ఉండదు.! తగిన సామర్థ్యం లేకుండానే సినిమా రంగంలోకి ఎట్లాగో జొరబడి తిష్ట వేసుకున్న వారి విషయంలో మొదటి కారణం ఉండవచ్చు. కాని ఎంతో సమర్థులనిపించుకుంటూ, విశేషానుభవంగల టెక్నిషియనులు అనుకరిస్తున్నారంటే వారి చేత ఆ పని చేయించే శక్తులు వెనక ఉండి తీరుతాయి.

అనుకరణ కళాకారుడి ఆత్మగౌరవాన్ని భంగపరుస్తుంది. దాని ద్వారా వాడికి కృత్రిమమయిన ఆనందం కూడా చేకూరదు. కాని కేవల వ్యాపారదృష్టి గలవాడికి అదే పట్టుగొమ్మ. దేనికి "మార్కెటు" ఉన్నదంటే దానికే ఎగబడతాడు వ్యాపారస్తుడు. "మార్కెటుకు" తప్ప వాడిదృష్టిలో మరి దేనికీ విలవ లేదు. అందుచేతనే అనుకరణ. అనుకరణకు కళాకారుడు అవసరం లేదు. "మార్కెటు" విషయం అనుమానాలు అవసరం లేదు. "కళాసృష్టి" అన్నమాట వ్యాపారదృష్టి గలవాడికి భయంకరమైనది. దాని వెనక పట్టి కీర్తే ఉండవచ్చు "మార్కెటు" ఉండక పోవచ్చు. పదిమందీ తిట్టినా నాలుగు డబ్బులు లాభం చేసుకుంటేదే వ్యాపారం. వ్యాపారంలో మానాభిమానాలకు ఆటే తావు లేదు. అవి లెక్క పుస్తకాల్లో కెక్కేవి కావు. అందుచేత ప్రొడ్యూసరు నిర్విచారంగా అనుకరణ చెయ్యగలడు, కాపీలు కొట్ట గలడు.

చిత్ర నిర్మాణం ఇంత ఖర్చుతో కూడి ఉండక, ఏ 30 వేలకో చిత్రం తయారవుతూ ఉండిన రోజుల్లో పిక్చర్లు తీసిన నిర్మాతలు ఇంతగా వ్యాపారస్తులు కారు. వారు కళాకారులే. చిత్ర నిర్మాణం గురించి వారికి మానాభిమానాలుండేవి. వారు పాశ్చాత్యుల నుంచి శిల్ప సంబంధమైన విషయాలు ఎన్ని నేర్చుకున్నా కళాసృష్టి విషయం దగ్గిర తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకునే వారు కారు. ఆనాడింతగా టెక్నిషియనులు లేక పోయినప్పటికీ, వారు రోజుకు పన్నెండు గంటలు పైగా వెట్టిచాకిరి చేసినప్పటికీ వారికి కళాకారుల కుండదగిన గౌరవం ప్రొడ్యూసరులనుంచి లభించేది. సినిమా చిత్ర నిర్మాణం అభివృద్ధి అయి పెద్ద పరిశ్రమలలో ఒకటిగా పరిణమించటంవల్ల జరిగిన మార్పేమిటంటే డబ్బు పెట్టుబడి చేసే తాహతు గలవాళ్లు చిత్రాలు తీసేటందుకు ముందుకు వచ్చి ప్రొడ్యూసర్లు కావటమూ సినిమా చిత్రాలు అమ్మకపు సరుకు కింద కావటమూ, టెక్నిషియనులు— నిజమైన కళాకారులు—గుమాస్తాల హోదాలకూ, కూలీల హోదాలకూ దిగి, కళాభిమానాన్నీ, కళాసృష్టిలోగల ఆనందాన్ని చంపుకుని సినిమా దుకాణదార్ల అవసరాలకూ—అప్పుడప్పుడూ అభిరుచులకూ — అనుగుణమైన చిత్రాలు తీయటమూనూ. వ్యాపారస్తులు సర్వాధికారులై, సినిమా కళా ప్రష్టలు

సెప్టెంబర్

# 4

వ, తేదీన

ఆంధ్రదేశమంతటా

విడుదల!

కె & కె. ప్రొడక్షన్స్ & తిరుమలై పిక్చర్స్ వారి

# జీవితనౌక

తెలుగు



మళయాళ, తమిళ ప్రాంతములందు
అఖండవిజయమార్జించుకొన్న
సాంఘిక చిత్రం........

Released through THE VAUHINI PICTURES, LTD.
MADRAS, VIJAYAWADA, GUNTAKAL..

కూలీలు కావటంతో సినిమా కళ ముండ మోస్తున్నది.

ఈ నాడు సినిమాలకు ఎన్నడూ లేని గిరాకీ ఉన్నదంటే సినిమా వ్యాపారం పూర్వం కన్న జోరుగా ఉన్నదని రుజువవుతున్నదేగాని సినిమా కళ అభివృద్ధి అవుతున్నదని రుజువు కావటం లేదు. పారిశ్రామిక పెట్టుబడిదారీ సినిమా చిత్ర నిర్మాణంలోకి వ్యాపించిందేమో, చిత్ర నిర్మాణ పరికరాలలో చాలా అభివృద్ధి కలిగింది. ఫోటోగ్రఫీ, శబ్దగ్రహణమూ, సెట్టింగులూ, దుస్తులూ, ఆర్కెస్ట్రా మొదలైనవి పూర్వం కన్న చాలా ఆడంబరంగా ఉంది, అమ్మకపు వస్తువుగా సినిమాచిత్రం పూర్వం కన్న ఆకర్షవంతగా ఉన్నది. కాని జాతీయ కళగా దీన్ని చూసి మనం తలలు వంచుకోవాలి. మనచిత్రాలను ఇతర దేశాలకు పంపి, "ఇందులో మా జాతీయ జీవితం, మా సంస్కృతీ వికాసాలు ప్రతిబింబిస్తున్నాయి. చూడండి," అని అనటానికి మనం నోచుకోలేదు. ఈ చిత్రాలద్వారా మనం జాతీయపునరుజ్జీవనం సాధించలేం. ఇవి మనజాతిలోని గుణాలను బలపరచలేవు, లోపాలను సంస్కరించలేవు. ఇవి మన వాస్తవిక జీవితానికీ, జాతీయ మన స్థితికీ, జాతీయాదర్శాయాలకూ నూరుమైళ్ళలోకి కూడా రాలేవు.

దుకాణదార్ల ఆధ్వర్యమూ, వ్యాపార దృష్టీ మన సినిమా కళకు పెట్టిన భిక్ష ఇదే. అనుకరణ మన సినిమాచిత్రాలను ఈదశకు తెచ్చింది. సహజంగా సమర్థ తగల టెక్నీషియనుల కిది ఎంత ఏవగింపైనా కలిగించవచ్చు. అందుచేతనే టెక్నీషియన్ల సమావేశంలో దీన్ని గురించి అంతమంది ప్రస్తావించటం జరిగింది. ఈ అనుకరణను నిరసించుతూ మాట్లాడినవారే, మన టెక్నీషియనులు విదేశాలకుపోయి అక్కడి ఉత్తమ శిల్పాన్ని అలవరచుకు రావాలని అన్నారు. వారికి ఇతర దేశవిజ్ఞానంపై ద్వేషం లేదు. ఇతర దేశ సంస్కృతిపై అంతకన్నా విద్వేషం లేదు. వారు సహించలేనిదల్లా కళాసృష్టికి బదులు అనుకరణ సాగుతూ ఉండటం మాత్రమే.

ఈ విషయాన్ని పత్రికలలో తగినంత ఆందోళన జరగాలి. అటువంటి ఆందోళన కొంతమంది సినిమా వ్యాపారస్తులకు తాత్కాలిక నష్టం కలిగించినా, సినిమా ప్రేక్షకులలో అక్షరాస్యులలో "ఆరోగ్యవంతమైన" సంచలనం తీసుకురాగలుగుతుంది. ఈనాడు సినిమాచిత్రాలు చూసే అసంఖ్యాకులు సినిమాచిత్రం ఒక కళావస్తువుగా చూడటం లేదన్నది నిర్వివాదాంశం. ఏ సర్కసునో, గారడీనో చూసే మనస్తత్వంతో వారు సినిమాచిత్రాలను చూస్తున్నారు. పైనుండి చిత్రనిర్మాతలు టెక్నీషియనులకూ, నటులకూ ఎంత గౌరవం ఇస్తున్నారో, కిందనుండి ప్రేక్షకులుకూడా అంతే ఇస్తున్నారు. అందమైన తారలను నాలుగణాల డబ్బులతో తమ ఎదుట మూడు గంటలసేపు "ఆడించు"కున్న తృప్తి వారికి లభిస్తున్నది. సినిమాచిత్రాలు తమ

(43-వ పేజీ చూడండి)



అమ్మడు పెళ్లిపీటలమీదినుండి నేరుగా బావిలోకి ఉరికినంతపని చేసింది. అందుకనే
"పెళ్లి చేసిచూడు" అన్నారు—విజయావారు



యువా వారి "టింగురంగా"లో శ్రీరామమూర్తి.

## చిత్రసమీక్ష:

# ప్రకాశ్ వారి "దీక్ష"

డైరెక్షన్: ప్రకాశరావు.
రచన: తాపీ, ఆత్రేయ.
పాటలు: తాపీ, ఆత్రేయ, జంపన, కోలేటి, ప్రయాగ.
ఫోటోగ్రఫీ: ఆర్. ఆర్. చంద్రన్.
సౌండ్: టి. ఎస్. రంగస్వామి, ఎస్. రాజగోపాల్.
సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు.
తారాగణం: జి. వరలక్ష్మి, రామగోపాల్, శివరాం, రంగస్వామి, శేషమాంబ, ఇతరులు.

ప్రకాశ్ ప్రొడక్షన్సువారి "దీక్ష" మొన్న 7 వ తేదీన మద్రాసు, రాజకుమారీ టాకీస్‌లో పత్రికా ప్రతినిధులకు ప్రదర్శింపబడింది.

శరత్ బాబు వ్రాసిన "రామేర్ సుమతీ" నవల "దీక్ష" చిత్రానికి కథను సమకూర్చినప్పటికీ అక్కడక్కడ కొద్ది మార్పులు చేశారు. ముఖ్యంగా చివరలో కథానాయకుడైన గోపీ (రామగోపాల్) జీవితాన్ని నేటి రాజకీయాలతో ముడిపెట్టడం చెప్పుకో దగిన మార్పు.

గోపీ శైశవంలోనే తల్లి చనిపోతూ అతన్ని వదిన యశోదమ్మ చేతుల్లో పెట్టి "ఈ బిడ్డని పెంచే భారం నీది" అని చెప్పి మరీ ప్రాణం విడుస్తుంది. వదిన గారాబంలో పెరిగిన గోపీ తోడి పిల్లలను సంఘటిత పరచి ఊళ్లో రౌడీ పనులు సాగిస్తూ అన్న బాలయ్య (శివరాం)ను రచ్చకీడుస్తూంటాడు. అయితే అతని రౌడీతనంలో ఉన్న విశేషమేమంటే అన్యాయ ప్రవర్తకులైన వారినే బాధిస్తాడుగాని మంచివాళ్ల జోలికిపోడు. ఏమైనా అతని చేష్టలు అన్నకు కంటగింపుగా ఉంటాయి. చివరికి బాలయ్య తమ్ముని భాగాన్ని తమ్మునికి పంచి ఇచ్చి అతనితో సంబంధం తెంచుకుంటాడు. "గోపితో మాట్లాడావంటే నా మీద ఒట్టే"నని భార్యను హెచ్చరిస్తాడు. గోపీ ఒంటరితనం భరించలేక ఎవరితో చెప్పకుండా బస్తీ ప్రయాణమవుతాడు. అక్కడి మోసాలను, అన్యాయాలను చూసి లోకవృత్తం తెలుసుకుంటాడు. తన గత ప్రవర్తనకు పశ్చాత్తాప పడి తిరిగి వదిన వద్దకు పరుగెత్తుతాడు. పరుగెత్తడంలో కారు కిందపడి గాయాలుతింటాడు. ఈ వార్తవిని యశోదమ్మ, బాలయ్య వచ్చి అతన్ని స్వగ్రామం తీసుకువెడతారు. గోపీ ఆరోగ్యం క్రమంగా బాగుపడి, నడత కూడా సన్మార్గానికి తిరుగుతుంది. ఒక "దేశ సేవకుని" వద్ద కొంతకాలం శిక్షణ పొంది తను కూడా "దేశ సేవ"కు జీవితం అంకితం చేస్తాడు.

సుప్రసిద్ధ నవలలను కథలుగా స్వీకరించి చిత్రాలు తయారు చేయడం తెలుగు సినిమా పరిశ్రమలో ఇంకా వ్యాప్తిలోకి రాలేదు. న్యూ థియేటర్సువారు, కేదార్ శర్మవంటి దర్శకులు మాత్రం ఉత్తమ రచయితల నవలలను తెరమీది కెక్కించి విజయం సాధించారు. నవలా సారస్వతం నుండి కథలను ఎన్నుకోవడంవల్ల మన సినిమాలకు మంచి కథలు రానిలోటు తీరుతుంది. ఒకే నమూనాలో తయారు చేసినట్లు కాకుండా కథల్లో వైవిధ్యం ఏర్పడుతుంది. జానపద చిత్రాలతో విసుగెత్తివున్న ఆంధ్ర ప్రేక్షక లోకానికి కొత్తరకం కథను అందించిన ప్రకాశ్ ప్రొడక్షన్సు వారిని అభినందించాలి.

అదీ కాకుండా ఈ చిత్రంలో సాహసికమైన మరో ప్రయత్నంకూడా జరిగింది. శృంగారం, ప్రేమఘట్టాలు లేనిదే చిత్రం రాణించదనీ, ఆర్థికంగా దెబ్బతింటుందనీ నిర్మాతల కొక అభిప్రాయం ఏర్పడి వుంది. "దీక్ష" కథలో శృంగారానికి కెక్కడా తావులేదు. సాధారణంగా ఇటువంటి కథలు తీసుకున్న నిర్మాత లేం చేస్తారంటే ఏదో విధంగా ప్రధానపాత్రల్లోనో, అప్రధానపాత్రల్లోనో శృంగారం ప్రవేశపెట్టితీరుతారు. దాంతో కథ అతుకులబొంతగా తయారవుతుంది "దీక్ష" నిర్మాతలు కొత్తపంథా తొక్కారు. ఈకథ కేవలం ఒక బాలునికి, అతనికీ అతని వదినకూ మధ్య నిష్కళంకమైన అనుబంధానికి మాత్రమే చెందినది. చిత్రంలో *Emotional appeal* కల ఘట్టాలు అనేకంగా ఉన్నాయి.

చిత్రం చివ్వర మూలకథలో చెయ్యబడిన మార్పువల్ల కథకుగాని, గోపిపాత్రకు గాని ఎలాంటి ప్రయోజనమూ చేకూరలేదు. అన్యాయం ఎక్కడ ఏరూపంలో కనిపించినా ఎదుర్కొనే స్వభావం గోపీది. అతని వ్యక్తిత్వం అంతా ఈ ఒక్క గుణంలో వుంది. అటువంటివాణ్ణి చివరికి "ప్రజలు నాయకుల మాటలు శిరసావహించాలి" అని ఉపన్యాసాలు దంచే "ప్రజాసేవకుని"క్రింద శిక్షణకు లోనుచెయ్యడం, "అందరికీ సమ్మతంగా ఉండే పనులే మనం చెయ్యాలి" అని గోపిచేత చెప్పించడంవల్ల అతని వ్యక్తిత్వం నిర్మూలింపబడినట్లయింది. రెండుమూడు సీనుల్లో, గోపీ ఊరూరా సభలు, ఉపన్యాసాలు చేసి ప్రజానాయకుడైనట్లు చూపించినంత మాత్రాన అతని "ప్రజాసేవ" మీద ప్రేక్షకులకు నమ్మకం, గౌరవం కలగవు. గోపీ వదినవద్దకు తిరిగి రావడంతో కథ ముగిస్తే సరిపోయేది. స్వతంత్రించి పొడిగించడంవల్ల కథ నెక్కడ ఆపు చెయ్యాలో నిర్మాతలకు తెలియని పరిస్థితి ఏర్పడినట్లు ప్రేక్షకులకు అనుమానం కలుగుతుంది.

సంభాషణలు శక్తివంతంగా ఉన్నాయి. కాని ఒక లోపాన్ని మాత్రం పేర్కొనక తప్పదు. కొన్ని కొన్ని పాత్రలకు, ముఖ్యంగా వరలక్ష్మి పాత్రకు అవసరమైన దానికంటె తక్కువమాటలివ్వబడ్డాయి. మాటల లోటును ఆమె నటనతో కప్పుకొని వచ్చినప్పటికీ, చాలినంత హావభావాలను చూపించనందున ఈ లోటు బయటపడుతున్నది.

డైరెక్షన్‌లో ఒక లోపం జరిగింది. మూకాభినయంతో, సాధ్యమైనంత తక్కువ మాటలతో భావాన్ని వ్యక్తీకరింపవలసి వచ్చినప్పుడు అవసరాన్ని మించిన అభినయం, మాటలు ఇవ్వబడ్డాయి. పనసకాయలను వదినకోయించినప్పుడు గోపీ, గోపీ బస్తీకి పారిపోయినప్పుడు, అతడు కారుకింద పడినప్పుడు వదిన చేసిన నటన ఈ లోపాన్ని వ్యక్తం చేస్తుంది. ఒక్క చూపులో, ముఖకవళికలలో వారి దుఃఖాన్ని ప్రదర్శించగలిగివుంటే ద్విగుణీకృతమైన *effect* కలిగేది.

అంతర్వాణి ప్రబోధాలను తరుచు చూపించడంతో వాస్తవికత దెబ్బతిన్నది. పనసకాయలను కోసినప్పుడు బల్లో వున్న గోపీ, అతడు కారుకింద పడ్డప్పుడు వదిన తుళ్లిపడినట్లు చూపడం పురాతన ఫక్కీలో నడిచింది.

సీనుల విభజనలో కూడా ఒక స్వల్ప లోపం జరిగింది. గోపీ స్వగ్రామంనుండి బస్తీకి కాలినడకన చేరుకున్నట్టు అంతా

ఒకే సీనులో చూపడం ఇందుకు ఉదాహరణ.

పెండ్యాల నాగేశ్వరరావుగారి సంగీతం భావస్ఫోరకంగా ఉంది. వంతపాటలు, ముఖ్యంగా మాధవపెద్ది సత్యంగారి గానం కమ్మగా హృదయాహ్లాదకరంగా ఉన్నాయి. సౌండు, ఫోటోగ్రఫీ నిర్దుష్టంగా ఉన్నాయి. వరలక్ష్మి తన పాత్రను అర్థంచేసుకుని ప్రతిభావంతంగా నటించింది. రామగోపాల్ చిత్రానికి తలమానికంగా ఉన్నాడు. అతనీ నటన సహజంగా ఉన్నది. ఆ రెండు పాటలను పాడించకపోతే అతని పాత్ర ఇంకా రాణించేది. అతనికి మంచి భవిష్యత్తు ఉన్నట్లు ఈ చిత్రం నిరూపిస్తోంది. శివరాం మామూలు ధోరణిలోనే నటించాడు.

"దీక్ష" చిత్రంలో శృంగారానికే కాదు స్థానంలేనిది; చవకబారు హాస్యం కూడా బహిష్కరింపబడింది. అయితే సంభాషణల్లో అక్కడక్కడ సున్నితమైన హాస్యంలేకపోలేదు. మొత్తంమీద ఈ చిత్రం ఆర్థికంగా విజయం పొందుతుందనడానికి సందేహమక్కర్లేదు. ★

## సృష్టి - అనుకరణ

(40-వ పేజీ తరువాయి)

కళద్వారా ప్రజలను ఉత్తేజపరచినట్లయితే ఇటువంటి హేయమైన పరిస్థితి ఉండదు.

ఇది మార్చరాని పరిస్థితి అని చేతులు కట్టుకుకూర్చో నవసరంలేదు. పత్రికలు పూనుకుని ఆందోళన సాగించినట్లయితే ఈ తరిస్థితి త్వరలోనే మారుతుంది. సినిమాకళయొక్క వాస్తవాభివృద్ధిని గురించి ఎవరూ ఆందోళన చెందకుండా, దానియందు ఎవరికీ విశ్వాసం లేకుండా సినిమాకళ దానంతటఅదే ఒక సుముహూర్తాన పైకి రావటం ప్రారంభిస్తుందనుకోవటం పొరపాటు. అనేక రంగాలలోనుంచి సినిమాకళపై ఆదరం బయలుదేరి అది ఒక యథార్థస్వరూపం తీసుకోవాలి. అప్పుడుగాని సరిఅయిన చిత్రాలు వెలువడవు. మన జాతినీ, జీవితాన్నీ, సంస్కృతినీ, ఆశయాలనూ ప్రతిబింబించే చిత్రాలు సాగిననాడు ప్రేక్షకులు సినిమాతారల కృత్రిమ సౌందర్యాన్ని ఆరాధించటం మాని సినిమాకళ సహాయంతో నూతనచైతన్యం సాధించగలుగుతారు. ★

## రాజు—పేద.

బి. ఏ. సుబ్బారావు ప్రొడక్షన్సువారు 'రాజు - పేద' కథను తెలుగులో చిత్రంగా నిర్మిస్తున్నారు. ఈకథను భారతీయ సంప్రదాయాలకు అనుగుణంగా మారుస్తారని తెలుస్తున్నది. దర్శకత్వం బి. ఏ. సుబ్బారావుగారు నిర్వహిస్తారు. సంభాషణలు తాపీధర్మారావుగారు సమకూరుస్తారు. వాహినీ స్టూడియోలో షూటింగు జరుగుతుంది.

———

## ముక్కుకు సూటిగా పోతే

(19-వ పేజీ తరువాయి)

లేందే ఎలా జీవయాత్ర గడపగలరు? గ్రామప్రజలకు సహాయం చేస్తే ప్రభుత్వపు లెక్కలు సరిగా ఎలా తయారవుతయి? కాబట్టే ఈ అక్రమతంతంతా ప్రభుత్వమే చూసీ చూడనట్లూరుకొంటున్నదేమోనని శేఖర మభిప్రాయం.

మూడు సంవత్సరాలు రెవెన్యూ ఇన్స్పెక్టరు ఉద్యోగం చేసిన తర్వాత తిరిగి శేఖరాన్ని ఆఫీసులో వేశారు. బాల్యస్నేహితు లెవరైనా కనుపిస్తే 'యేంరా, ఎంత సంపాయించేవు ఇన్స్పెక్టరు ఉద్యోగంలో?' అని అడిగేవారు. శేఖరానికేమీ జవాబు చెప్పడానికి తోచక "నీ మొహంలే" అనేసి తప్పించుకొనేవాడు.

రెవెన్యూ ఇన్స్పెక్టరు ఉద్యోగంలో అతనెంత కష్టపడి, న్యాయంగా పనిచేసినా, ఏవో లేనిపోని సాకులతో, తాసీల్దా రతని మీద ఛార్జీలు ఫ్రేముచేయించి, చివరి కతని కదివరకు ఆరుసంవత్సరాలలోనూ వచ్చిన ఇంక్రిమెంట్లు ఊడగొట్టించాడు. కలెక్టరు కప్పీలుపెట్టుకొన్నా, శేఖరం మొర ఎవరూ వినలేదు.

ఇప్పుడు శేఖరం తను ప్రారంభంలో ఆరు సంవత్సరాలక్రితం యెంత జీతం తీసుకొంటున్నాడో, ఇప్పుడూ అంతే తీసుకొంటున్నాడు. అతననుకుంటూ ఉంటాడు 'దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది కాని, అధికార్లలో పాతుకొనిపోయిన ఆ బానిసభావాలు, దోపిడీ విధానాలు ఇంకా నశించలేదు. అధికార్ల ప్రవర్తనలో మార్పు వచ్చి, ప్రజల సుఖంకోసమే తాము నౌకర్లగా నియమింపబడ్డామని తెలుసుకొన్ననాడే, దేశం బాగుపడుతుంది. అందాకా ముక్కుకి సూటిగాపోయే ఉద్యోగస్థులందరి గతీ అధోగతే' అని.

శేఖరం తన సంసారంలో, ఉద్యోగంలో, జీవచ్ఛవంలాగా ఈదుతున్నాడు. అతనికి ఉద్యోగంలో ప్రమోషనాశ మరి లేదు. మరి అతనికీ అంధకారంలోనుంచి విముక్తి యెప్పుడో? ★

## అత్తవారిచ్చిన కట్నం

(6-వ పేజీ తరువాయి)

'ఒరేయి, ఈ మూడు వేలు నీ దగ్గరుంచు, తరువాత తీసుకుంటారు' అన్నాడు.

'ఎక్కడిదిరా ఈ డబ్బు?' అని అడిగాను.

'ఆ అమ్మ యిచ్చింది' అన్నాడు.

నవ్వాలో ఏడవాలో తెలియక

'ఆ పెళ్లికొడుకువి నువ్వేనా' అని అడిగాను.

'అవునురా, రాత్రి మెయిలుకు బిచాణా కట్టు. బొంబా యెళ్ళొద్దాం. యింక ఈ ఊళ్ళో ఉంటే బండారం బయటపడుతుంది." అన్నాడు.

ఆరి పిడుగా! అని ముక్కుమీద వేలేసుకున్నాను. ★

---

శేఖర్: "నేను వంటా, పనీపాటా, బాగా చేతైన పిల్లనే పెళ్లిచేసుకుంటాగాని, అందంగా ఉండాలనీ, సంగీతం వచ్చినదై ఉండాలనీ నాకేం పట్టింపులులేవు."

రామం: "అలాగైతే మాఇంట్లో వంటలక్క వుంది. ఇష్టమైతే ఒకసారి వచ్చిచూడు."

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 57

ఒకనాటి మధ్యాహ్నం విల్ ఫర్ట్ ఇంటివెనుక తోట గోడ కావలివైపున మాక్సిమిలియన్ మారెల్ ఆత్రుతతో నిరీక్షిస్తున్నాడు. ఆనాడు వాలంటిన్ రాకకు అరగంట జాప్యమయింది. ఆలస్యానికి హేతువుగురించి మాక్సిమిలియన్ యోచిస్తున్నంతలో వాలంటిన్ వచ్చింది. ఆలస్యానికి క్షమార్పణ కోరుకుంది.

"వాలంటిన్! ఇంతసేపెందు కాలస్యమయిం దీపూట?" అన్నాడు మాక్సిమిలియన్.

"డాంగ్లర్ కుమార్తె యూజినీ వచ్చింది. ఇంతవరకూ ఆమెతోనే ఉన్నాను."

"ఆమెతో నీకు స్నేహం చనువూ ఉన్నాయా?"

"అంత స్నేహముందని చెప్పలేను. కాని ఇప్పుడే ఆమె నాతో రహస్యంగా మాట్లాడింది. ఆమెకి ఆల్బర్ట్‌ని వివాహం చేసుకోడం బొత్తిగా ఇష్టంలేదుట. నేనూ ఫ్రాంజ్‌తో వివాహం నాకు బొత్తిగా ఇష్టంలేదని ఆమెకి చెప్పాను."

"వాలంటిన్! నువ్వు నా కంటికి దేవతవలె కనిపిస్తున్నావు. కాని నిజంగా డాంగ్లర్ కుమార్తెనుచూసి ఎవరు వివాహం చేసుకోడాని కంగీకరిస్తారు? అయితే ఆల్బర్ట్‌నికాక మరొక యువకు నెవరినైనా ఆమె ప్రేమిస్తున్నదా?"

"లేదు. ఆమె ఎవ్వరినీ ప్రేమించడం లేదుట. అసలామెకు వివాహమంటేనే ఇష్టంలేదు. స్వేచ్ఛగా జీవించాలని కోరికట. తన తండ్రి భాగ్యవంతుడైనందువల్లనే తనకీ నిర్బంధం వచ్చిందంటుంది. అందువల్ల తండ్రి ధనమంతా ఒక్కసారి నష్టమైపోతే బాగుండునంటుంది. అప్పుడు ఏ నాటకశాలలోనో చేరి స్వయంగా ఆర్జించుకుంటూ స్వేచ్ఛగా జీవించవచ్చునని ఆమె అభిప్రాయం."

"పోనీలే! ఇప్పుడామె మాటెందుకులే. నిన్నుగురించే చెప్పు వాలంటిన్."

"ఏం చెప్పను మాక్సిమిలియన్. ఇప్పుడింక వీలులేదు కూడా. ఇప్పుడు నా సవతితల్లి నాతో ఏదో ముఖ్యవిషయం మాట్లాడాలిట రమ్మని కబురుపంపింది. బహుశా నా అదృష్టం ఆవిషయంపైన ఆధారపడిఉంటుంది కాబోలు, మాక్సిమిలియన్! నాకొక్క మాట చెప్పు. నేను నా సర్వస్వం నష్టపడి పేదరాలనైపోయినా నువ్వు నన్నిప్పటి మాదిరిగా ప్రేమించగలవా?"

"అదేమిమాట వాలంటిన్! నీకీ సంపదలు లేకపోయినా సరే నిన్నే నేను ప్రేమిస్తాను. కాని ఇప్పుడు నీ సవతితల్లి నీతో మాట్లాడబోయే ముఖ్యవిషయం నీవివాహాన్ని గురించికాదుకదా! నేనీ మధ్యనే ఆల్బర్ట్‌ని చూశాను. ఫ్రాంజ్ పారిస్‌కి తిరిగి వస్తున్నట్టు అతనికి ఉత్తరంవచ్చిందని నాతో చెప్పాడు."

"నిజమా? అందుకోసమేనా నా సవతితల్లి నాకు కబురు పంపింది? ఏమో"

"ఎందుకు కాకూడదు?"

"ఏమో నా మనస్సుకి అలా తోచడంలేదు మాక్సిమిలియన్. నా సవతితల్లి పైకి ఆక్షేపణ చెప్పకపోయినా ఆమె కీవివాహం ఇష్టంలేనట్లు నా కనుమానం."

"ఫ్రాంజ్‌తో నీ వివాహం ఆమె కిష్టంలేని పక్షంలో, ఇంకొక సంబంధమేది చూపినా ఆమె అంగీకరిస్తుందేమో?"

"అలా కాదు మాక్సిమిలియన్. వరుని గురించికాదు ఆమె అభ్యంతరం. అసలు నాకు పెళ్లిజరగడమంటేనే ఆమె కిష్టంలేదని నా అనుమానం."

"పెళ్లికాక పెళ్లంటే ఇష్టపడనిది ఆమె ఎందుకు పెళ్లిచేసుకుంది?"

"నీకు బోధపడ్డంలేదు మాక్సిమిలియన్. ఏడాదికింద టొకసారి నేను కాన్వెంట్‌లో చేరి చదివి తరవాత మతప్రచారానికి వెడతానన్నాను. పెళ్లిచేసుకోకుండా బ్రహ్మచారిణిగా ఉండిపోతానన్నాను. అలా కాదనీ, అది తప్పనీ నాకు ఆమె బోధించినమాట నిజమేకాని, రహస్యంగా అందుకు ఒప్పుకుంది. ఆమె ప్రోద్బలంపైనే నా తండ్రి కూడా అందుకొప్పుకున్నారు. కాని నా తాతగా రిదివిని కళ్ల నీళ్లు కుక్కుకున్నందువల్ల నేనా ప్రయత్నం మానుకోవలసివచ్చింది. నేను మానేశానని స్పష్టంగా చెప్పేవరకూ నా తాతగారి దుఃఖం నివారణ కాలేదు. వాళ్లు నన్నేం చేసినా సరే ఇంక వెళ్లనని ఆయనకి మాటఇచ్చాను."

"నిజంగా నీ కెంత కరుణ వాలంటిన్! నువ్వు దేవతవు కాని నువ్వు వివాహంచేసుకోకపోతే నీ సవతితల్లి కేం లాభం?"

"నేను భాగ్యవంతురాలిని మాక్సిమిలియన్! అదీ కారణం. నేను మతప్రచారకులలో కలిసివెళ్లిపోతే నాపేర వచ్చే ఆస్తి అంతా నా తండ్రికి సంక్రమిస్తుంది. తరవాత అది నా సవతితమ్ముడు ఎడ్వర్డ్‌కి లభిస్తుంది."

"ఎంత చిత్రం! అంత చక్కని యువతి కింత దురాశా?"

"ఆమె కొడుకుకోసం."

"కాని నువ్వు ఆమెతో రాజీచేసుకోలేవా?"

"ఎలాగ? తనకి ఏ అపేక్షా లేనట్లు నటించే మనిషితో రాజీ ఎలా చేసుకోవడం? ఆగు మాక్సిమిలియన్! నన్నెవరో పిలుస్తున్నారు. నేను వెడతాను." అంటూనే ఆమె గభగబ నడిచివెళ్లిపోయింది.

అనువాదం: సీతారామ్

## 58

సరిగ్గా వాలంటీన్ తోటలో మాక్సిమిలియన్ తో మాట్లాడుతున్న సమయంలో, విల్ ఫర్ట్ భార్యతోసహా తన తండ్రి గదిలో ప్రవేశించాడు. ఇద్దరూ వృద్ధునికి చెరొకవైపునా రెండు కుర్చీలలో ఆసీనులైనారు.

పక్షవాతరోగంవల్ల అశక్తుడైన వృద్ధుడు నయర్టైర్, చక్రాలు ఏర్పాటు చెయ్యబడిన ఒక పడకకుర్చీలో కూర్చుని ఉన్నాడు. వృద్ధునికి శరీరం బొత్తిగా స్వాధీనంలో లేదు. నౌకరొకడు ఉదయమే పడకగదినుంచి కుర్చీని తోసుకుని ఈ గదికి తీసుకువస్తాడు. తిరిగి రాత్రివేళ కుర్చీని తోసుకువెళ్ళి పడకగదిలో దిగబెడతాడు. పాతికేళ్లనుంచి విశ్వాసంతో సేవచేస్తున్న నౌకరు బారోయ్ నిత్యం వృద్ధుని అంటిపెట్టుకుని ఉంటాడు. సర్వశక్తులూ ఉడిగిపోయి, కాటికొక కాలుచాపి కూర్చున్న వృద్ధునికి చూపూ వినికిడీ మాత్రం మిగిలాయి. మిగిలిన ప్రజ్ఞలన్నీ లోపించినందువల్ల కాబోలు, వాని అన్నిటి శక్తి కళ్లలోనూ చెవులలోనూ కేంద్రీకరింపబడినాయి. నోట మాట రాకపోయినా మెదడు అతి నిశితమైనదైనందువల్ల కళ్లతోనే ఆ వృద్ధుడు మాట్లాడగలడు. కళ్ళతో ఆజ్ఞలిస్తాడు. కళ్ళతో కృతజ్ఞత ప్రకటించగలడు. ఈ యింటిలో వృద్ధుని మూగభాష ముగ్గురికే తెలుసును. మనుమరాలు వాలంటీన్, కొడుకు విల్ ఫర్ట్, నౌకరు బారోయ్. నిత్యం ప్రేమతో ఆదరించి పరిచర్య చెయ్యడంవల్ల వాలంటీన్ వృద్ధుని నేత్రాలలో సర్వభావాలనూ కనిపెట్టగలదు. అతని భావాలకు అతని కళ్లే అద్దాలు.

విల్ ఫర్ట్ నౌకరును బయటికి పంపివేసి వృద్ధునితో ఇలా అన్నాడు:

"నాన్నా! మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని వచ్చాం. వాలంటిన్‌కి వివాహం నిశ్చయ పరిచాం. వివాహం మూడుమాసాలలో జరుగుతుంది."

విల్ ఫర్ట్ ఎంత తరిచి చూసినా, వృద్ధుని కళ్లలో ఎలాటి భావమూ వ్యక్తం కాలేదు.

ఈ మారు హీలాయిజ్ విల్ ఫర్ట్ ఇలా అంది: "మీకు వాలంటిన్ పట్ల ఆపేక్ష అపారమనే సంగతిమాకు తెలుసును. అందువల్లనే ఆమెకీ సంబంధం కుదిర్చాము. వరుడు జనరల్ క్వెస్నెల్ కుమారుడు ఫ్రాంజ్ డి ఎపినే."

పేరు వినగానే వృద్ధుడు కన్నులు పెద్దవి చేసి చూశాడు. దంపతులిద్దరి వంకా చురుగ్గా చూశాడు. పూర్వం జనరల్ క్వెస్నెల్‌కీ ఈ వృద్ధునికీ మధ్య కల రాజకీయ వైరాలను బాగా తెలిసిన విల్ ఫర్ట్‌కు ఈ చూపుల అర్థం ఇట్టే బోధపడింది. వృద్ధునికి ఈసంబంధం బొత్తిగా ఇష్టంలేదని గ్రహించాడు. ఇలాఅన్నాడు: "నాన్నా! వాలంటిన్‌కి అప్పుడే పందొమ్మిదేళ్లు నిండాయి. ఇంకా వివాహానికి జాప్యం చెయ్యడంమంచిది కాదు. అయినా ఇందులో మిమ్మల్ని మీ అవసరాన్నీ కూడా మేం మరిచిపోలేదు.

వివాహం అనంతరం మీరు వాలంటీన్ వద్దనే నివసించడానికి వరుడు అంగీకరించే ఏర్పాటుకూడా చేశాం. ఇక్కడవలెనే అక్కడా మీకు సంరక్షణ ఎప్పటి రీతిగా జరుగుతుంది. ఇప్పుడు వాలంటీన్ ఒక్కతే మీకు సంరక్షణ చేస్తోంది. అప్పుడు మీకిద్దరు సంరక్షణ చేస్తారు."

నయర్ టైర్ కళ్లలో రోషం ఉట్టిపడుతోంది.

హిలాయ్ విల్‌ఫర్ట్ ఇలా అంది: "ఈఏర్పాటు ఫ్రాంజ్‌కి కూడా సమ్మతమయింది. అతని కుటుంబంకూడా హర్షించారు. అతనికి మేనత్త తప్ప దగ్గర వారెవరూ లేరు. తల్లిచిన్నప్పుడే పోయింది. అతని రెండో యేటనే అతని తండ్రిని ఎవరో హత్య చేశారు."

"హత్యకూడా చాలా చిత్రంగా జరిగింది. హంతకుడెవరో తెలియదుకాని ఇంతవరకూ శిక్ష పడకుండా తప్పించుకున్నాడు."

ఈమారు నయర్ టైర్ ముఖంలో చిరునవ్వు పొడచూపింది.

"ఇప్పుడు వాలంటిన్‌కి అతనితో వివాహం జరిగితే ఆ నాటి హత్యనూ రాజకీయ వైరాలనూ అందరూ మరిచిపోతారు. ఒక విధంగా రాజీ కుదిరినట్లవుతుంది" అన్నాడు విల్‌ఫర్ట్.

"అదంతా నాకు తెలుసులే" అన్నట్లు చూశాడు వృద్ధుడు. ఆచూపులో నిర్లక్ష్యం, నిరాదరభావం వ్యక్తమైనాయి.

విల్‌ఫర్ట్ చాటుగా భార్యను వెళ్లమని సంజ్ఞ చేశాడు. హిలాయ్ విల్‌ఫర్ట్ లేచివెడుతూ "ఎడ్వర్డ్‌ని మీవద్దకు పంపమన్నారా?" అని అడిగింది. వృద్ధుడు అభ్యంతర సూచకంగా కన్నులు రెపరెపలాడించాడు. హిలాయ్ కోపంతో ఉడికిపోయింది. కాని అణుచుకుని "వాలంటీన్‌ని పంపనా?" అంది. వృద్ధుడు సమ్మతి సూచకంగా కన్నులు మూసుకున్నాడు.

విల్‌ఫర్ట్ దంపతులిద్దరూ వెళ్లినవెంటనే వాలంటీన్ వచ్చింది. వృద్ధుని చూసి ఏదో సంభాషణ నడిచిందనీ, అతని మనస్సుకు వ్యథకలిగిందనీ ఆమె ఇట్టే గ్రహించింది.

"ఏమయింది తాతా! ఏమయింది! వాళ్లు ఏమైనా అన్నారా?" అంది.

వృద్ధుడు కన్నులు మూసుకున్నాడు.

"నన్ను గురించేనా?"

"అవును" అన్నట్లు మళ్లీ కళ్లుమూశాడు.

"ఆగు, ఏమిటది? ఏమయుంటుంది?" అని కొంతసేపు ఆలోచించింది.

"ఆ! తెలిసింది." అంటూ వృద్ధుని సమీపించి మెల్లిగా "నా పెళ్లిగురించే కదూ?" అంది.

"అవును."

"నేను మాట్లాడకుండా ఊరుకున్నానని కాదూ నీ కోపం?"

"అవును" అన్నట్లు కళ్లుమూసి తెరిచాడు వృద్ధుడు.

"అయితే ఈ సంబంధం నీ కిష్టంలేదా?"

అంతే నన్నట్లు వృద్ధుడు కళ్లుమూసి తెరిచాడు.

"నిజంగా నాకూ ఇష్టంలేదీ పెళ్ళి తాతా" అంది వాలంటిన్ మరింత మెల్లిగా. వృద్ధుని కళ్లలో ఈమారు ఆనందం ఉట్టిపడింది.

"అయితే నీకూ ఇష్టంలేదన్నమాట ఈ పెళ్ళి! నిజంగా నీకే ఈగతి పట్టకపోతే నాకు సహాయం చేసిఉండేవాడవు కదా! వాళ్ల పన్నాగాల్ని భగ్నం చెయ్యడానికి ఇద్దరం కలిసి ప్రయత్నం చేసేవాళ్లం. కాని పాపం ఇప్పుడు నువ్వు ఇంకేం చెయ్యగలవ్, నన్ను చూసి కళ్లనీళ్లు పెట్టుకోడం తప్ప!"

ఈమాటు వృద్ధుని కళ్లలో కొంటెతనం కనపడింది. ఫరవా లేదనే ధీమా కనపడింది "నువ్వు పొరపడుతున్నావు. నాకు కాలూ చెయ్యీ మాటా లేకపోయినా, నీకు సహాయం చెయ్యగల శక్తి నా కింకా ఉంది సుమా" అన్నట్లు చూశాడు.

వాలంటిన్ పరీక్షగా వృద్ధుని కళ్లలోకి చూస్తూ "నా కింకా సహాయం చెయ్యగలనంటావా తాతా?" అంది.

"అవును" అన్నాడు వృద్ధుడు కళ్లతో.

తరవాత వృద్ధుడు కనుబొమ లెగరేసి చూశాడు. అంటే అతని కేదో కావాలని చెప్తున్నాడన్నమాట.

"ఆగు. ఏంకావాలి? ఇప్పుడు చెప్పు" అంది వాలంటిన్. అని, అక్షరాలన్నీ మొదటినుంచి ఒక్కొక్కటే ఉచ్చరించడం మొదలుపెట్టింది. నకారందగ్గరకు వచ్చేసరికి ఆగమన్నట్లు చూశాడు.

ఆపైన నిఘంటువొకటి తెచ్చి వృద్ధుని ముందు పెట్టింది.

నకారంతో ఆరంభమైన పదాలను వేలితో చూపుకుంటూ వచ్చింది. 'న్యాయవాది' అనే పదం రాగానే వృద్ధుడు ఆగమన్నాడు.

"ఓ! న్యాయవాది కావాలా?" అంది వాలంటిన్.

"అవును" అన్నాడు వృద్ధుడు కళ్లతో.

"నాన్నకి చెప్పనా?"

"చెప్పు." అన్నాయి అతని కళ్లు.

వెంటనే వాలంటిన్ పరిచారకుని ద్వారా తండ్రికి కబురు పంపింది. విల్‌ఫర్ట్ వచ్చి, "ఎందుకు పిలిపించారు నాన్నా?" అన్నాడు.

"తాత న్యాయవాదిని పిలిపించా లంటున్నాడు" అంది వాలంటిన్. విల్‌ఫర్ట్ చకితుడైనాడు. తండ్రివంక తీక్షణంగా చూశాడు. "న్యాయవాదిని పిలిపించమన్నారా మీరు?" అన్నాడు.

"అవును" అన్నాయి వృద్ధుని నేత్రాలు.

"ఎందుకు?"

వృద్ధునికళ్లలో ఈమారు ఎట్టిభావం గోచరించలేదు. ఎందుకో చెప్పడం అతనికి ఇష్టంలేదని విల్‌ఫర్ట్‌కి బోధపడింది.

"మాకు అపకారమేదైనా తలపెడుతున్నారా? మీ ప్రయత్నం వృధాకాక తప్పదు. ఆలోచించుకోండి" అన్నాడు విల్‌ఫర్ట్.

"ఏమైనా సరే ఆయన న్యాయవాదనిపిలిపించా లన్నారు కాబట్టి పిలవవలసిందే. నేనే వెడుతున్నాను" అన్నాడు బారోయ్, పాతికేళ్ల పరిచర్యవల్ల వచ్చిన అధికారంతో.

"అవును" అన్నట్లు చూశాడు వృద్ధుడు.

"సరే అలాగే పిలిపించవచ్చును. కాని ఇదంతా చూసేవా కూడా నచ్చదు." అన్నాడు విల్‌ఫర్ట్.

"మరేం ఫరవాలేదులెండి. నేనే వెళ్లి పిలుచుకువస్తాను" అంటూ బారోయ్ వెళ్లిపోయాడు.

# ఆంధ్రరాష్ట్రం స్వామీజీ దీక్ష

(4-వ పేజీ తరువాయి)

నెహ్రూ రాజాజీ మొదలైనవారు ఆరోపిస్తే కాదనగల నైతికబలం, ధైర్యం ఆంధ్ర నాయకులకు లేకపోయింది.

ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని ఈ దుస్థితిలో నుంచి ఉద్ధరించడానికి స్వామీజీ ప్రాయోపవేశ దీక్ష కొంత ఉపకరించిందని అంగీకరించాలి. కేంద్రనాయకుల వైఖరిలో గాని, తమిళనాయకుల వైఖరిలోగాని మార్పులేని మాటనిజమే. కాని కాంగ్రెస్ ఎన్నికల నివేదికవల్లనే లభించవలసిన ఆంధ్రరాష్ట్రం మన నాయకుల మూలంగా ఎలా కష్టసాధ్యమయినదీ ప్రజలు గ్రహించారు. ఇంత దుస్థితిలో పడిన ఉద్యమాన్ని సామాన్య రాజకీయ పరిపాలనాది సమస్యలవలె పరిగణించడానికి వీలులేదని బోధపడింది. ఆంధ్రరాష్ట్రోద్యమంలోని నైతికబలం, అవసరం తిరిగి ఆంధ్రప్రజానీకానికీ, నాయకులకూ తెలిసివచ్చింది. ఇంతవరకూ స్వామీజీ ప్రాయోపవేశ దీక్ష సార్థకమయిందని చెప్పవచ్చును. ఇకనైనా ఆంధ్రదేశనాయకులు, ముఖ్యంగా తెలుగుమంత్రులూ ఆంధ్రకాంగ్రెస్ నాయకులూ తమ వైఖరినీ, తమ కార్యవిధానాన్నీ సంస్కరించుకుని చిత్తశుద్ధితో, స్వార్థరహిత బుద్ధితో కృషి చెయ్యవలసిన అవసరాన్ని గుర్తించినట్లయితే, స్వామీజీ దీక్ష పూర్తిగా సార్థకమైనట్లు భావించవచ్చును.

పండిట్ నెహ్రూ లేఖనుబట్టి ఒక్క విషయం స్పష్టపడుతున్నది. కేంద్ర నాయకుల వైఖరి ఇకముందు ఆంధ్రదేశ నాయకుల కార్య విధానాన్నిబట్టే మారాలి కాని ఒక్కసారిగా ఈ నాడు ఎన్నికలకోసం మారాలంటే మారదు. కాబట్టి ఇంక ఆంధ్రరాష్ట్రోద్యమంపట్ల కేంద్రనాయకులకు శ్రద్ధ కలుగచేసి గౌరవాదరాలను పురిగొల్పే బాధ్యత ఆంధ్రదేశనాయకులపైనే ఉంది. ఈ బాధ్యత నిర్వర్తించబడినప్పుడుగాని ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సాధ్యపడదు. ఆంధ్రదేశనాయకు లందరూ ఈ విషయమై స్వామీజీకి తదితర దీక్షాపరులకు హామీ నివ్వగలిగిన ట్లయితే—అనగా మాటలతో కాదు, చేతలవల్ల విశ్వాసం పురిగొల్పిన ట్లయితే,—స్వామీజీ దీక్ష సార్థకమయిందని తృప్తిపడి దీక్షను విరమించుకోడానికి వీలు పడుతుంది. రాజకీయ వైరాలనూ, వ్యక్తిగత వైషమ్యాలనూ మరచి ఆంధ్రనాయకు లందరూ ఐకమత్యంతో కృషి చెయ్యగలిగితే సత్యాగ్రహ పవిత్రాశయం సఫలం కాగలదు. ఆంధ్రదేశంలో ఈ చైతన్యం తీసుకువచ్చి, రాష్ట్రోద్యమాన్ని స్వామీజీ ఉద్ధరించినవారౌతారు. ఆంధ్ర నాయకుల మధ్య ఈ ఐకమత్యం కుదరడానికి స్వామీజీ ఇంక దీక్షను విరమించి, ఈ నాయకు లందరినీ సక్రమపథాన నడిపించాలి. ఇప్పటికైనా ఢిల్లీలో వ్యక్తిగత ప్రతిష్ఠల ఆధారంగా గూఢసమాలోచనలు జరపడం మాని ఆంధ్రకాంగ్రెస్ నాయకులు అందరినీ సంఘటిత పరచడానికి పూనుకోవాలి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ప్రధాన లక్ష్యంగా ఇకనుంచి కార్యనిర్వహణకు త్యాగదీక్షతో చిత్తశుద్ధితో పూనుకున్నట్లు ఆంధ్రనాయకులు ఆంధ్ర ప్రజానీకానికి విశ్వాసం కలిగించాలి. ఈ ఐకమత్యం, ఏకోన్ముఖ కృషి తప్పకుండా తమిళనాయకుల అక్రమవైఖరిని నిరోధించి, కేంద్ర నాయకుల ఆదరాన్ని పొందగలవు.

---

# ★ కాంగ్రెస్ అధ్యక్షత: నెహ్రూ ఎన్నిక ★

ఆలిండియా కాంగ్రెస్ కమిటీ శనివారం నాడు సమావేశమై పురుషోత్తమదాస్ టండన్ గారి రాజీనామాను అంగీకరించి, వెన్వెంటనే పండిట్ జవహర్లాల్ నెహ్రూను అధ్యక్షునిగా ఎన్నుకుంది. అంతవరకూ పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ గోవిందవల్లభ పంత్ నెహ్రూ, టండన్ గార్ల మధ్య రాజీకుదర్చడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. కాని ఈ యత్నాలు విఫలమైనాయి. ఉభయులకూ సమ్మతమైన కార్యవర్గాన్ని ఆలిండియా కాంగ్రెస్ కమిటీ నియామకంద్వారా నిర్మించడానికి మధ్యవర్తులు ప్రయత్నించారు. ఇది టండన్ గారికి సమ్మతమైనప్పటికీ, నెహ్రూకు సమ్మతం కాలేదని కొందరు తెలియచేసిన వార్త. అదీకాక శుక్రవారంనాడు తమ రాజీనామా నిర్ణయాన్ని తెలియపరుస్తూ టండన్ గారు చేసిన ప్రకటనపట్ల నెహ్రూ అసంతృప్తి ప్రకటించారట. కార్యవర్గాన్ని పునర్నిర్మించడం అధ్యక్షులుగా తమకు అగౌరవమని టండన్ శుక్రవారం ప్రకటనలో అన్నారు. ఈ సమస్య కంతకూ మూల కారణం ఒకరిద్దరు వ్యక్తుల్ని కార్యవర్గంలో చేర్చడం క్షేమంకాదని తాను భావించడమే నని అన్నారు. నెహ్రూ రాజీనామా నిచ్చి కాంగ్రెస్‌లో మార్పు తేవాలనే వాదాన్ని టండన్ అంగీకరించ లేదు. నెహ్రూ నేడు జాతికంతకీ ప్రాతినిధ్యం వహించగల పురుషుడైనందువల్ల వారి రాజీనామాను తాను అంగీకరించడం కంటె తానే రాజీనామా నివ్వడం మేలనీ, నెహ్రూ రాజీనామా ఇచ్చినట్లయితే కాంగ్రెస్ బలహీనపడిపోతుందనీ టండన్ అన్నారు. కాని ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో ఈ మార్పు తీసుకురావడం, ఈ సమస్య నుత్పన్నం చేయడం కాంగ్రెస్ సంస్థకు క్షేమంకాదని కూడా తమ అభిప్రాయం ప్రకటించారు. తాను నియమించిన కార్యవర్గం పనిచేసిన పది మాసాల కాలంలోనూ చక్కని ఐకమత్యంతో వ్యవహారాలు నిర్వహించబడినాయనీ, కార్యవర్గంపై మోపబడుతున్న ఆరోపణలకు ఆధారం లేదనీ టండన్‌గారన్నారు. నెహ్రూ రాజీనామా వల్ల తాను నియమించిన కార్యవర్గ సభ్యులు రాజీనామా ఇవ్వవలసి వచ్చిందనీ, అందువల్ల తానుకూడా రాజీనామా ఇవ్వక మార్గాంతరం లేదనీ అన్నారు.

దాదాపు ఇదేరీతిని ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశంలో కూడా టండన్ గారు తమ రాజీనామా హేతువును వివరించారు. రాజీనామాను సమావేశం ఆమోదిస్తూ ఒక తీర్మానం చేసింది. తరవాత నెహ్రూను అధ్యక్షపదవిని స్వీకరించాలని కోరుతూ గోవిందవల్లభ పంత్, యస్. కె. పాటిల్ గార్లు ప్రతిపాదించిన తీర్మానాన్ని సమావేశం ఆమోదించింది.

తన రాజీనామావల్ల ఏర్పడిన పరిస్థితి మూలంగా కాంగ్రెస్ అధ్యక్షపదవికి అంగీకరిస్తున్నట్లు పండిట్ నెహ్రూ చెప్పారు. తన రాజీనామావల్ల కాంగ్రెస్‌వాదుల మనస్తత్వంలో అప్పుడే పరివర్తన కానవస్తున్నదనీ, కాంగ్రెస్‌సంస్థకు సంబంధించిన సమస్యకు పరిష్కారమార్గాన్ని గురించి అందరూ యత్నించడం శుభసూచకమనీ నెహ్రూ అన్నారు. తన రాజీనామా వల్ల వచ్చిన సమస్య కాంగ్రెస్ సంస్థను బలహీన పరిచిందని టండన్ గారు చెప్పిన వాదాన్ని నెహ్రూ అంగీకరించలేదు. అంతే కాక రాజీనామా అనంతరం కాంగ్రెస్ మరింత బలపడిందన్నారు. త్వరలోనే కాంగ్రెస్ సర్వసభ్య సమావేశాన్ని జరపడం అవసరమని నెహ్రూ సూచించారు.




రత్నమాణిక్యాలు (నాటికలు): రచయిత: వి. డి. ప్రసాదరావు; వెల 1-8-0; ప్రతులకు: వి. డి. ప్రసాదరావు, సాత్యవతేయ ప్రచురణలు, 5. నాదముని స్ట్రీటు, త్యాగరాయనగరు, మద్రాసు.

ఈ సంపుటంలో సనాతన, అయితే గియితే, రత్నమాణిక్యాలు, పరిపాటి, విలయము అనే అయిదు నాటికలున్నాయి.

"సనాతన" నాటిక అస్సాంలో 1860 ప్రాంతాల్లో వచ్చిన కరువును ఆధారంగా చేసుకొని రచింపబడింది. సనాతనుడనే 14 ఏళ్ల బాలుడు క్షామంలో తండ్రి, చెల్లెలు చనిపోగా, తల్లికి రొట్టె తీసుకు రావడంకోసం వెడతాడు. తిరిగివస్తూ ఎంత ఆకలవుతున్నా తల్లికి దాచిన రొట్టెను తినకుండా, చివరికి నీరసంతో చనిపోతాడు. ఈ నాటిక చదువుతుంటే ఆ సంఘటనలు ఏ వాతావరణంలోనైనా జరిగేవే ననిపిస్తుందిగాని, క్షామవాతావరణంలో జరిగినట్లనిపించదు. క్షామబీభత్సాన్ని రచయిత ఇంకా విపులంగా చిత్రిస్తే బాగుండేది. సంఘటన అస్సాం రాష్ట్రానికి చెందినది గనుక అక్కడ వెంకయ్య, పిచ్చమ్మ, ముత్తెమ్మ పేర్లను ప్రవేశపెట్టడం అసందర్భంగా ఉంది.

"అయితే గియితే" నాటికలో ఒక్కసారిగా లాటరీ కొట్టెయ్యాలనే ఆశతో 'పజిల్స్' వ్యసనంలో పడినవారి మనస్తత్వం చిత్రింపబడింది.

"రత్నమాణిక్యాలు" నాటికలో పిత్రార్జితమైన ఆస్తిలో భాగంకోసం పెద్దకొడుకు, పెళ్లినాటి కట్నం భూమికోసం పెద్దకూతురూ తల్లిని వేధించడం వర్ణించబడింది.

"పరిపాటి"లో నిత్యమూ వైద్యవృత్తిలో తలమునకలౌతున్న ఒక డాక్టరును ఒక వేశ్య ఆకర్షిస్తుంది. వేశ్య తన్ను నిజంగా ప్రేమిస్తున్నదని డాక్టరు భ్రమించి, పెళ్లాంబిడ్డలను, వృత్తిని మరచిపోతాడు. ఆమె తన వైఖరి వివరిస్తుంది: డాక్టరు తనవద్దకు వచ్చే రోగుల వ్యాధి నివారణనే ప్రధానంగా ఎంచుతాడు గాని వారి ఇతర కష్టసుఖాలు అతని కక్కరలేదు; అలాగే వేశ్యయైన తనకు కూడా విటులకు సౌఖ్యం చేకూర్చడమే ముఖ్యంగాని వారిని ప్రేమించడం తన పనికాదు. ఈ మాటలతో డాక్టరు మనసు మార్చుకొని, ఇంటికి తిరిగి వెడతాడు. పై సిద్ధాంతం బాగానే వుందిగాని, వేశ్య మొదట్లో విటులను ఆకర్షించి, తరవాత వారిని సన్మార్గులను చేసి పంపించి వెయ్యడం పరిపాటిగా ఎందుకు పెట్టుకున్నదో దురూహ్యం.

"విలయము" నాటికలో ఒక యోగిని దర్శించే నిమిత్తం వచ్చిన పరదేశిని, అతని భార్యను యోగివద్ద ఉంటే ఇద్దరు కపట సన్యాసులు మోసగించి దర్శనం కలక్కుండా చేస్తారు, ఆఖరికి సముద్రం పొంగివచ్చి ఆశ్రమమంతా కొట్టుకుపోతున్నప్పుడు పరదేశిని, అతని భార్యను మునిగిపోకుండా ఒక వ్యక్తివచ్చి రక్షిస్తాడు. ఆ రక్షించిన వ్యక్తి తాము దర్శనం కోరి వచ్చిన యోగియే నని పరదేశికి తరవాత తెలుస్తుంది. ఈ నాటికలో చెప్ప దలుచుకున్నదేమిటో తెలియడంలేదు.

సరళమైన శైలి, చమత్కార పూరితమైన సంభాషణలు గల "అయితే గియితే" "పరిపాటి" నాటికలు స్టేజిమీద మంచి రక్తికడతాయి. (ఎన్నార్)

---

## గ్రంథస్వీకారము.

మిఠాయ్:—పిల్లలగమ్మత్తు కథలు; ప్రతులకు: కె. జగ్గారావు, రత్నా పబ్లిషర్సు, అనకాపల్లి: వెల 0-4-0

---

ప్రధానమంత్రి కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించడంతో ప్రస్తుతానికి అలిండియా కాంగ్రెస్ కమిటీకి పార్లమెంటరీ కాంగ్రెస్‌కీ మధ్య వ్యవహారాలు సక్రమంగానే నడిచిపోవచ్చును. కాని ఉభయపదవులూ ఒకే వ్యక్తి నిర్వహణలో ఉండడం కాంగ్రెస్‌కు మంచిదికాదని నెహ్రూగారే ఒప్పుకున్నారు. నెహ్రూ అధ్యక్షపదవిని స్వీకరించడంతో కాంగ్రెస్‌లోని కలతలు, అనైక్యత తొలగిపోతాయనుకోడం పొరపాటు. టండన్‌గారి ఎన్నుకున్న అలిండియా కాంగ్రెస్ కమిటీ ఈ క్లిష్టపరిస్థితిలో వారిని విడిచిపెట్టి నెహ్రూను ఎన్నుకోడం కాంగ్రెస్‌వాదుల అవకాశవాద తత్వాన్ని నిరూపిస్తున్నదని రఫీఅహమ్మద్ కిద్వాయ్ అన్నారు. ఇంత తీవ్రవిమర్శకు తావు లేకపోయినా, నెహ్రూ ఇప్పటి మార్పుతో కాంగ్రెస్ వాదులలో కాని సంస్థలో కాని పరివర్తన వచ్చిందనుకుంటే అది సరికాదు. కాంగ్రెస్ ప్రభుత్వాల అసమర్థత వల్ల ప్రజలకు కాంగ్రెస్‌పట్ల వచ్చిన అసంతృప్తి తొలగిపోవాలంటే, పరిపాలనా విధానంలో మార్పులు రావలసిందే కాని కాంగ్రెస్ సంఘాలలో పదవులలోనుంచి కొందరిని తీసి మరికొందరిని తెచ్చినందువల్ల ప్రజలకు విశ్వాసం కలగడం కష్టం. కాబట్టి అధ్యక్షుడుగా నెహ్రూ కాంగ్రెస్ సంస్థ నియమాలలోనూ, వ్యవహారవిధానంలోనూ, పరిపాలనా విధానంలోనూ తీసుకురాగల మార్పులను బట్టే ప్రజలు కాంగ్రెస్ సంస్థ మంచిచెడ్డలను నిర్ణయించగలరు. ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras

త్వరలో వెలువడనున్నది.

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(మొదటి భాగం)

అనువాదం:

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము.

**వెల: మూడున్నర రూపాయలు**

ప్రాపకులు:

## ఆంధ్రగ్రంథమాల,

**మద్రాసు 1.**

# కిసీ భారత్

సగర్వముగా సమర్పించు

## జూపిటర్ వారి

అద్భుత చిత్రం

# [illegible]

(తమిళం)

పాటలు: పాపనాశనం శివన్

సంభాషణలు: టి. ఎస్. కుమారస్వామి

కిసీ భారత్, 3/2, మదన్ వీధి, కలకత్తా 13.